—* శ్రీరాముఁడు *—

# కనకతార

(గ్రంథకర్త: చందాల కేశవదాసుగారు, జగ్గయ్యపేట.)

(పార్శీస్టాటు ననుసరించి వ్రాయబడినది.)

[ప్రదర్శనానుకూలము]   పలువురచే బ్రదర్శింపబడుచున్నది.   [పార్శీమట్లు]

ఉదయసేనుని సదయహృదయము, క్రూరసేనుని ఘోరకృత్యములు, కమలాదేవి విమలవర్తనము, పసిపాపలగు తారాకనకసేనులు పడు పలువిధములగు బాధలు, లోభగుప్తుని రోదనము, వీరపాలుని యుక్తి, శూరపాలుని క్రౌర్యము, గిద్దూఖాన్ హాస్యము, కంచుకి రాజభక్తి, జాలరుల అమాయకత్వము, దొంగల దుడుకు కార్యములు, విజయసేనుని విక్రమము, మంత్రుల యాలోచనము, లచ్చిగయ్యాళితనము, రాధాబాయి కాటిల్యము, రత్నాబాయి ఉదారత, రాంశెట్టి కారుణ్యము, న్యాయవాదుల ధీశక్తి, సోమేశ్వరదీక్షితుల దొంగసాక్ష్యము, రాంశెట్టిపుత్రుల ముద్దుమాటలు, చదువదగినవి. క్రూరసేనుడు నిద్రలోనున్న అన్నను ఉదయసేనుని చంపునప్పుడును కమలాదేవిని చెఱబెట్టి నిర్బంధపెట్టినప్పుడును, తారాకనకసేనుల చంప నుద్యమించు నప్పుడును భయకంపితులుగ నివారుండరు. కన్నీరుగార్చనివారుండరు. కమలాదేవి సముద్రమున బడునప్పుడు వీరపాల శూరపాలురు తారాకనకసేనుల వధింప యత్నించునప్పుడును కమల పులివాతబడబోవునప్పుడును, కమలపై నేరారోపణము జరుగునప్పుడును, కనకసేనుడు నిందితురాలుగా నున్న తల్లిని గుర్తించునప్పుడును జాలిపడనివారుండరు. తార, దొంగలనాయకుడగు బూచిగానిచేత చిక్కునప్పుడును, కాళికకు బలి కాబోవునప్పుడును, కమలాదేవి పల్లెవానిచేత జిక్కి నిర్బంధపెట్టబడునప్పుడును గుండె నీరుగానివారుండరు. తార విజయసేనునిచే విడిపింపబడునప్పుడును, లచ్చిచేత కమల విడిపింపబడునప్పుడును, కనకసేనుని రాజ్యప్రాప్తివేళను తారాకనకసేనులు తల్లిని గలిసికొనునప్పుడును, క్రూరసేనుని యుద్ధమున నోడించి కనకసేనుడు దేశమునుండి వెడలనడుపునప్పుడును సంతోషింపనివారుండరు. జాలరులయొక్కయు, దొంగలయొక్కయు, కంచుకి గిద్దూఖానుల యొక్కయు హాస్యసంభాషణము వినునప్పుడు కడుపుచెక్కలగునట్లు నవ్వనివారుండరు. ప్రతివారు తప్పక పఠింపదగిన నాటకరాజము. శైలికై ఈక్రిందిపద్యము చూడుడు. వెల రు 1-4-0.

గీ॥ మూపలిబాని మయాపిణి ♦ బిడ్డగాని । యౌవనికేదినంబున ♦ కిష్టమగునా
దాని నేయప్పరసమని ♦ తలంచువరుండు। ఎవనిపిచ్చి వానికి మూద ♦ మీయకున్నె?

వలయువారు: కందుల గోవిందం, జనరల్ బుక్కుడిపో, బెజవాడ.

# అర్జునప్రతిజ్ఞ

(౫ అంకముల నాటకము)

కవికిశోర, అవధానకంఠీరవేత్యాది
బిరుదాంకితులును శతావధానులు నగు
బ్రహ్మశ్రీ

## ప్రతాప వేంకటేశ్వరకవి

విరచితము

ప్రకాశకర్త:
కంటుల గోవిందం
జనరల్ బుక్కుడిపో,
బెజవాడ

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపబడియె.

1925



వెల: 0—12—0



## అంకితము.

సీ. పరమసంయమియంచు ♦ స్వర్ణగోవునొసంగఁ
గైకొన నెవఁడు ని ♦ రాకరించె
మోక్షార్థియై నిర ♦ పేక్షను రేబవల్
బాలాసపర్య లె ♦ వఁడొనర్చె
ఆవేళ నీవేళ ♦ యని లేక బ్రాహ్మణా
వళికి మృష్టాన్న మె ♦ వ్వండొసంగె
కాశినిదర్శించి ♦ గయ కేగి బ్రహ్మక
పాలమోక్షంబు నె ♦ వ్వఁడువహించె
గీ. తనవలె నెవండు సర్వభూ ♦ తములఁగాంచె
మన్నవపురంబు నెవనికి ♦ మనికిపట్టి
జనకుఁడైనట్టి కోటయ ♦ శాస్త్రికెలమి
కృతినిడితిదీని పితృభక్తి ♦ యతిశయిల్ల.

# పీఠిక.

---

సుమారు పదిసంవత్సరముల క్రిందట నామిత్రుఁడగు బ్రహ్మశ్రీ బ్రహ్మాండము సుబ్బారావుగారు "ఐరావతచరిత్రము" అను చిన్ని పొత్తము నొకదానిని నాకు విన్పించి దీనిని నాటకముగా నాకు మాసము గడువుతో రచించియియ్యఁగఁ గోరుచు నొక 'ప్లాటు'ను వ్రాసి యిచ్చిరి. మిత్రుఁ డడిగిన గడువుమేరకు నాటకమును పూర్తిఁగావించియు నత్తరి నాకుఁ గలిగిన కొలఁది యిబ్బందులచే వారికినొసఁగి యుండనైతి. తదుపరి యియ్యది నామమాత్రావశిష్టముగ నాయొద్దనే యున్నది. ఈ యైరావతవ్రతమునే కొందఱు గజలక్ష్మీవ్రతమని యెదరు. అనతికాలము క్రిందట విజయవాడ పురవాసులును వైశ్యోత్తములును శ్రీమంతులునునగు కందుల గోవిందముగారితో ప్రసంగవశమున దీనివిషయమై నుడువగ వారు విని దీని ప్రథమముద్రణము తానొనరించి వెలయింతునని ప్రీతిపూర్వకముగ వచియించి శీఘ్రమే యటులొనరించినందులకు వారికి నేనెంతయు కృతజ్ఞుఁడను. ఇందలి దోషములు ద్వితీయముద్రణమున సవరించుకొనఁగలను. ప్రాజ్ఞులు ఖరుగాక!

ఇట్లు,

గ్రంథకర్త.

# పాత్రలు



## పురుషులు

పాండురాజు
సుధర్ముఁడు
ధృతరాష్ట్రుఁడు
భీష్ముఁడు
విదురుఁడు
వ్యాసుఁడు
దుర్యోధనుఁడు
సేవకుఁడు
ధర్మరాజు
భీముఁడు
అర్జునుఁడు
నకులుఁడు
సహదేవుఁడు

ఇంద్రుఁడు
బృహస్పతి
సోమనాథవర్మ
మాణిభద్రుఁడు
ధౌమ్యుఁడు
కృష్ణుఁడు
నారదుఁడు
పులస్త్యుఁడు
మాండవ్యుఁడు
వీరావధాని
కాశీభొట్లు
అచ్యుతరామశాస్త్రి

## స్త్రీలు.

గాంధారి
కుంతి
మాద్రి

రంభ
దాసి



ఓం.

శ్రీ బాలాత్రిపురసుందరీ దేవ్యై నమః




# అర్జున ప్రతిజ్ఞ

నాంది




కల్యాణగుణావహంబయి బుధ ♦ శ్రేష్ఠప్రస్తుతంబై త్రిలో
కైకప్రాభవదా నగోత్తమునియం ♦ దావిర్భవంబై యశో
దాకల్పద్రుమమై ప్రకాశిలిన దే ♦ తత్త్వమ్ము యాతత్త్వమే
మీకున్ మాకు శుభోదయంబిడి జయో ♦ న్మేషమ్ము కల్పిం
చుతన్!

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సుఘ—బావా! బావా! మారిషా!

ి—(ప్రవేశించి) ఏమి! కరగ్రహణ సమయమున సుముహూర్తము దాఁటునని వధూవరుల వేగిరించు పురోహితునివిధమున నాతురుఁడవై పిలుచుచున్నాఁడవు!

సాత్రి—బావా! ఆతురతమునకన్న మిన్నయగు తరుణమగుటఁ జేసి యటులఁ బిలిచితి. అది యెట్లంటేని బుద్ధిని బృహస్పతిని, నీతిని శుక్రుని, నాలోచన యుగంధరుని, సత్యమున హరిశ్చంద్రునిఁ బోలి సహృదయులై రసికావతంసులరగు నీసభ్యులు మన

మీరేని నూతననాటకప్రదర్శనము చేయుదుమను తలంపునఁ
దదవలోకనాకుతూహలులై వచ్చియుండ మన మింకను
గాలహరణ మొనర్పఁజెల్లునా?

మారి—అటులేని యేనాటకప్రదర్శనమున నీప్రాజ్ఞజనచిత్తరంజన
మొనర్పఁగలము?

సూత్ర—అందులకేకదా నిన్ను రావించితిని!

మారి—బెస్త పెద్దరికము నానెత్తి కేలచుట్టెదవు? ఏదేని పరమపవిత్ర
మగు నాటకమును సూక్ష్మబుద్ధి వీవే యోజింపుము.

సూత్ర—(ఆలోచించి) భారతకథ ననుసరించి నూతనముగా వెలు
వడిన 'అర్జునప్రతిజ్ఞ' యను నాటకము మనకు నేఁడు ప్రదర్శ
నీయ మని నామనమున స్ఫురించుచున్నది.

మారి—ఓహో! ప్రతాప వేంకటేశ్వరకవివిరచితమా? కథయు
నాటకమును నూతనమైనటులె కవికి గ్రంథరచనయు నూతన
మగుటచే నీపండితమండలికిఁ గర్ణరసాయన మొనర్పఁగలమా?

సూత్ర—మన సామాజికుల నేర్పు పెంపునను ముఖ్యముగా నీసహాయము
చేతను, భారతకథయందలిగల గౌరవమువలనను నీసభా
సదులు రసగ్రహణతత్పరులగుటచేతను, నెట్లైని యద్దాని పెంపతి
శయింపఁ జేయఁగలమను కుతూహలము కలదు.

మారి—మిత్రమా! సందేహమేమి? (ఒకవైపునఁ జూచి) అ.
మనవాక్యాలాలించి మన సామాజికులు తత్ప్రదర్శనమున కు
మించినటు లున్నది. (వినుటనభినయించి) పాండుమహారాజు
మంత్రితో నేదియో సంభాషించుచు నిటువచ్చుచున్నటు లు
న్నది. మన మిఁక జాగుసేయవలదు. వెడలుదము రమ్ము.

ఇది ప్రస్తావన

---




## ప్రథమాంకము

### ప్రథమరంగము.

(పాండురాజు బాణపాణియై సుధర్ముఁడను మంత్రితోఁ బ్రవేశించి

పాండు—అమాత్యచూడామణీ! మన పౌరవర్గ మును దెంచి యీవన్య మృగముల బాధ సహింపలేక,

గీ॥ "పంటపైరుల నెల్లను ♦ మంటఁగలిపి
పశువులను మ్రింగి మము బాధ ♦ పఱచుచుండె"
ననుచు మొఱవెట్టఁ గరుణ సుం ♦ తైన లేక
యెన్ని మృగములఁ జంపితి ♦ మిపుడు మనము!

సుధ—దేవా! మీరటుల యోజించవలదు. మృగయా విహారము క్షత్రియోచితధర్మ మగుటయు, నంమ పౌరవర్గమును గన్నతండ్రివిధమునఁ గాపాడవలసిన బాధ్యతఁగలవారగుటయుఁ వారినిఁ బెక్కుసిక్కులపా లొనర్చు దుష్టమృగముల జక్కాడుట యనునది మీకవశ్యకరణీయమే కాని మఱియొండు కాదు. కానఁ గరుణవహింపక తక్కుంగల దుష్టమృగముల నుక్కడఁగించుఁడు. ఇంతదనుక నెక్కుడు శ్రమంపడితిరి. కాన నిక్కడ నీవటవృక్షచ్ఛాయ నించుక విశ్రమించుఁడు.

పాండు — మంత్రిసత్తమా!

తే॥ వలదువలదన్న వినక యీ ♦ వనవిచిత్ర
ములను వీక్షింతమనుచు నా ♦ చెలులువచ్చి
క్రూరమృగారావములకుఁ దా ♦ మెంతభీతిఁ
గలఁతపడుచుండినారొ వే ♦ గమునఁ గనుము.

సుధ — మానవేంద్రా! తమ రావిషయమై శంకింపవలదు. వారికేదగు సదుపాయము లొనర్చియే వచ్చితిని. తగు భటనికాయ మందునిచితిని. వారికేవిధమైన భయములేదు.

చ॥ పులులను మేఁకలంబలెను ♦ పోనిమిమీఱఁగ బట్టికట్టి యే
కలనికిఁగూడ జంకని ప్ర ♦ కాశబలాఢ్యుల సేవకోసమై
నిలిపితి మీదు తామరస ♦ నేత్రిలకుం దలపూలువాడునే
బలరిపుతుల్యవైభవ! యు ♦ పాంశుభాకర! పాండుభూవరా!

పాండు — అమాత్యచంద్రమా! అట్లైనచో నాకేతివ్వంతయు లేదు.

సీ॥ సాధులౌగోవుల ♦ సడిగప్పుచో మ్రింగు
పులులను గోఁటలం ♦ బొడిచినాము
వృషభరాజమునైన ♦ నెగనెత్తికొసిచను
మృగరాజముల నెల్ల ♦ మడిపినాము
గొఱియలనుంబట్టి ♦ గొల్లల బాధించు
వృకజాతిరూపు మా ♦ యించినాము
నోరెఱుంగనిశేళ్ళ ♦ ఘోరంబుగా మెక్కు-
గండకమృగములఁ ♦ జంపినాము
గీ॥ ఘోరమృగసంచయంబును ♦ కోఁకె వెదుక
కంటకలికంబునకునైనఁ ♦ గానరావు
పౌరజనములసౌఖ్య సం ♦ భాజనముగ
సర్వశూన్యంబుగను జేయఁ ♦ జాలినాము.

కాన నింక మనకర్తవ్యమేమి?

సుధ—దేవా! మనమెంత దుష్టమృగసంహారంబుచేసినను నెచ్చటనేని నొక్కటి యుండకపోవునా?

పాండు—అటులైన నీకు సందేహమేల? వనమెల్లగాలించి దుష్టమృగ నిశ్శేషము సల్పఁ బ్రతినఁబూనితిని గాన నడువుము.

సుధ—(కొంచెము నడచి దృష్టిసారించిచూచి) రాజేంద్రా! అయ్యదే! ఆపొదచాటున నేదో మృగమున్నటులఁ దోఁచుచున్నది. దానిని బరిశీలించుఁడు.

పాండు—పరిశీలింపఁగ నేల! నేనిదే దానినిరూపుమాపి నీశంకఁ బాపెదను.

(అని బాణము విడుచును)

(తెరలో)

హా! పాండురాజాధమా! నీకెంత కండకావరమురా! నీవు రాజ్యమదాంధుఁడవై యొడలెఱుఁగక మృగయార్థమువచ్చి మా యాశ్రమములనెల్ల ధ్వంసమొనర్చుటయేకాక యేణీరూపమున నేకాంతక్రీడనుండు మావంటి జడదారులఁగూడ వధింపఁబూనితివా? నీ కంత్యకాలము సమీపించినదిలెమ్ము. మదర్థాంగినున్నవారిని హింసించితివి గనుక నీవును నీభార్యలతో నేకాంతమున సంచరించితేని విగతప్రాణుఁడ వౌదువుగాక! హా! పాండురాజా! హా! పాండురాజా!

(అని ప్రాణములు విడుచును.)

పాండు—అమాత్యవరా! ఏమిది వింతగనున్నదే? ఎక్కడిదీ దీనార్తనాదము! చక్కఁగా వింటివా?

సుధ—దేవా! చక్కఁగ నాలించితిని. ఎవరో మునిదంపతులు మృగరూపముల నేకాంతక్రీడ విహరించుచుండినట్లును, నెఱుంగక యుడిన తమబాణప్రహారముచేఁ బ్రాణములువాయుచు శాపమొసంగినట్లును నే గ్రహించితిని.

పాండు—అది యేమో పరిశీలించి రమ్ము.

(సుధర్ముఁడు వెడలి వీక్షించివచ్చి)

సుధ—దేవా! మన మనుకొన్నంతయే యైనది. మునిదంపతుల శవములందుఁ గాన్పించుచున్నవి.

పాండు—హా! పరమేశ్వరా! ఇఁక నాగతియేమి? ఎంతలో నెంత యయ్యెను! ఈ మునిసింహుఁ డెంతదారుణశాపమిచ్చెను! ఇఁక నాజన్మమెందులకు? కాల్పనా! ఆహా! నాకెట్టిదుర్గతిపట్టినది! ఈవార్త మాదేవేరులకు నేమని తెల్పుదు? వారిదివిన్నఁ బ్రాణములతో భూమిపై జీవింతురా?

గీ॥ గద్దెపొంకమ్ములును రాజ్య ♦ కాంక్షఁబూని
వంశవృద్ధికి సంతతిఁ ♦ బడయనైతి
సమ్మదమ్మున పారవ ♦ శ్యంబుతోఁగ
వనితలను గూడనైతి నా ♦ తనివిదీఱ.

గీ॥ వన్యమృగములఁ జెండాడ ♦ వలయుననుచు
వచ్చి యీఘోరమైన శా ♦ పంబుఁగంటి
దేవదేవేశ! నాకేది ♦ తెరవులేదు
వడిగ ననుఁగూడ జేర్చు నీ ♦ పదములకడ.

(అని మూర్ఛిల్లును)

సుధ—ఆహా! మారాజుగారి కెంతదుఃస్థితివచ్చెను! ఈవార్త ధృతరాష్ట్ర మహారాజాది కురుసంతతికి నెంతసంతాపము కల్గించునో కదా! దీనికి నేనును గొంతకారణమే. ఏలన, "నీపాటికి వేటఁజాలింతము, సర్వదుష్టమృగనాశము గావించితి" మనసింకను గలపనిచెప్పి యీకార్యము చేతులారఁ జేయించిన నాకెంతపాపము సంభవించునోగదా! అయినను నేనేమిచేయఁ గలను! విధినిదాఁట నెవ్వరితరము? ఆహా! మూర్ఛచెందెనే! ఇఁక నేనేమిచేయఁగలను?

(మూర్ఛ తెలిసి రాజు లేచికూర్చుండి)

పాండు—మంత్రీ! నేనొక క్షణమైన నాప్రాణములు భూమిపై నిలుపనోల్ల. కాన నేనిప్పుడు నాకరవాలముచే జీవమ్ములఁ బాపి కొని ముక్తికాంతాకరగ్రహణమొనర్చి సుఖమునందెద. నన్ను వారింపవలదు. ఏదీ కరవాలము? (ఖడ్గమువైపుచూచి) ఆహా! యేమి నామనోవైకల్యము! ఇదిగో!—ఖడ్గము నాచెంతనే యున్నదే. (అని ఖడ్గమునుగైకొని నఱుకుకొనఁబోవును)

సుధ—(చేయిపట్టుకొని) ప్రభూత్తమా! తమరెఱుంగని ధర్మములు గలవే! ఆత్మహత్య ఘోరనరకహేతువనికదా పెద్దలు నుడువుట! కాన మీరిట్టిదారుణకృత్య మొనర్చుకొనుటమాని కనికరము కరము దిగఁద్రోసి "యీపాపికి వేటచాలింత"మని మీరు నుడువగా నంతటితోఁ దనివినొందక యీమహాఘోరమునకు కారణభూతుఁడనైన నన్ను భవత్కరవాలమున కెఱఁజేయుఁడు.

పాండు—మంత్రీ! విధి నిన్నట్లు ప్రేరణఁజేయ నీవేమి సేయఁగలవు?

ఉ॥ సర్వజగంబునిండియు ని ♦ శల్ బవలుళ్ దమదివ్యకాంతులన్
బర్వి ప్రకాశవంతము నొ ♦ నర్పఁగఁజాలిన చంద్రసూర్యులన్
బర్వదినమ్ములన్ వెతల ♦ పాలయి రాహువుచేతిలోఁ గటా!
యోర్వఁగరానిబాధ పడు ♦ చుంటుట నావిధిచేతనేగదా.

కావున నావిధి నానుదుటపై "నీవిధముగా దుర్యశమునొంది కాంతాభోగపరాఙ్ముఖుఁడవై చింతలనొందు"మని మూఁడుపంక్తులచే లిఖింప నిన్ననఁబనేమి! సర్వదా ఈశ్వరుఁడు నెవరిపైనైనను నిందను బడఁద్రోయును. కాని తనపై లేశంబేనియు వహించఁడుగదా! కావున నీ నాపాపంబునకు నేనే కారణభూతుఁడనుగాని నీ వేమాత్రముఁగావు. నే నీ చింతాసముద్రమ్మున మున్గిపోవుటచే ననతికాలములోనే నే నా

స్వర్గరాజ్య సింహాసన మధిష్ఠించుట నిక్కము. కావున,

తే॥ ఘనవిపత్పరంపర లను ♦ కాలుమబ్బు
ల నెగఁజిమ్మెడు ఝంఝూని ♦ లమ్ము మూఁడ్కి
దనరు మత్సేతులు వసించు ♦ స్థావరమున
కిపుడు కొనిపొమ్ము నన్ను మ ♦ దిష్టసఖుఁడ!

సుధ—దేవా! మీ దేవేరుల కీవృత్తాంత మచటనే తెల్పి వారి నిటకుఁ దోడ్కొని వచ్చెద.

పాండు—తిరిగి నీ వేలయిటకువచ్చెదవు? వారి నెవఁడేని యొకభటుని తోఁబంపి మనపురమ్మున కేఁగి నా యీదుఃస్థితి వినిపింపుము. ఇంక నే నీకాననాంతరములనే నాజీవితము గడుపుకొని యెదను.

సుధ—స్వామీ! అటులొనర్చెద మనపురమున కగుదెంచి యెప్పటి యటుల రాజ్యపరిపాలన మొనర్చుటకు నా ప్రార్థన. ఇఁక నేను వెళ్లివచ్చెదను.

(సుధర్ముఁడు నిష్క్రమించును)

పాండు—హా! పరమేశ్వరా! సర్వవ్యాపీ! చిద్విలాసా! సర్వపాప నాశంకరా! శంకరా! తననేర్పుకలిమిచే శివునంతవానికిని మరులుకొల్పి తుదకు నీశత్రువైన పంచబాణుఁడు నేటి కీవిధముగా నాకుంగూడ పరమశత్రువుఁడయ్యెఁగా! దేవా! నీవు సంహారకర్తవని శ్రుతులు చెప్పునుగదా! శత్రువునకు శత్రు వాప్తుఁడను న్యాయమ్మున నన్ను నీయాప్తునిఁగా నెంచి నీకర్తృత్వము నెఱవేర్పరాదా? దేవతాపతియైన యింద్రుఁడంతవానిని దన మాయాజాలమునకు లోనుజేసికొని సదసద్వివేచనను మాన్పి హీనకార్యములను జేయించఁగా నాబోటి నీచమానవునిపైఁ దన ధాటి చూపించుట యొకలెక్కా? నట్టడవులలో కౌపీనధారులై ఆకలములనుదిని సర్వదా భగవల్లీలలనుండు విశ్వామిత్రాది

మహాఋషీంద్రులనె తనకు వశులఁగాఁ జేసికొని కీలుబొమ్మలవలె నాడించిన మన్మథుఁడు తృణీకృతమ్మైనను అమూల్యదుకూలములధరించి యిష్టమృష్టాన్నతృప్తుఁడనై దాసదాసీసేవల మహాభోగుఁడనై సన్నాడించుటొక లెక్కయా? ఇంతకుమున్ను,

చ॥ సడలి లొయారమొల్క చెఱు ♦ నవ్వులయుఁ గడకంటిచూపులున్
నుదుపుల మందరస్వర మ ♦ నోజ్ఞత నొప్పఁగ సిగ్గుగుల్కఁగా
జఘనతటీసీమపై నటన ♦ సల్పఁగ కన్బొమ ముళ్లు వేయుఁగా
బడఁతుల హావభావముల ♦ బద్ధుఁడనై సుఖమందనైతిఁగా.

ఉ॥ రాచరికంపు ధర్మమున ♦ రాజ్యపు పెంపునొసర్చుచున్ భళీ!
చూచుకొలంది నిత్యమును ♦ జూడదలంపగు మోములున్ సుధా
వీచికలైనవాక్కులు స ♦ పీనచమత్కృతులున్ గ్రహించు చేఁ
తే చతురుండనై వనజ ♦ నేత్రలభోగము లంకనైతిగా.

ఉ॥ అన్నులమిన్న కౌఁగిళుల ♦ నందఁగఁజాలుట మోవిపానకం
బున్నతిమీఱ నానుట మ ♦ హోత్సవ మొప్పఁగ మోముమోముపైఁ
దిన్నఁగఁజేర్చి ముద్దిడుట ♦ దేహములొక్కటిగాఁగ నొట మేల్
పున్నముచేతఁగల్గు, ననుఁ ♦ బోలెడుపాపికిఁ గల్గనేర్చునే? . . .

మ॥ స్తనభారమ్మున నమ్రమై జఘనవి ♦ స్తారమ్మునన్ మెల్లనై
గొనకొ తావి సుగంధియై తములపా ♦ కుల్ వీడెముల్ చుట్టి తో
డ్కొవిరాఁ గాంచిన జ్ఞాని వెఱ్ఱియయి పోఁ ♦ డో కాంతలన్ మించి భూ
మిని వశ్యౌషధమొండులేమి నిఁక నా ♦ మే నెట్లు సాగింతునో.

ఛీ! యేమి నాకీవెఱ్ఱి! ధైర్యసాహసముల కునికిపట్టగు పురుషుఁడనగు నేనేఘుట్టు లధైర్యమునొంద సహజముగా మనమున నిబ్బరము లేని యబలలగతి యెట్లోకదా! ఆహా! పరిమళపుదెత్తావులు వీచుచున్నవి. ఈ తావులు నా సెలంతల తనూవ్రదేశమునుండి వచ్చుచున్నవి కాఁబోలును! (దృష్టిసారించి) ఆహా! ఆ వచ్చువారలు వారే! ఎంతధైర్యము తెచ్చ

కోందమునినను తత్పాదనూపురధ్వనులకును, కరకంకణరవములకును నా యొడలు జలదరించి మనోభవతాప ముదయించుచున్నది. ఎట్లేని మనోనిగ్రహమూని వైరాగ్యము వహించెదఁగాక!

(కుంతియు మాద్రియు నొకభటునితోఁ బ్రవేశింతురు)

కుంతి, మాద్రి — (దుఃఖముతో) హా జీవితేశ్వరా! ఇంక మాగతియేమి?

పాండు — (దుఃఖముతో) మన్మనోహారిణులారా! ఊరడిల్లుఁడూరడిల్లుఁడు.

కుంతి — హా! నాథా! మాకీ ప్రపంచమేల?

మ॥ నిశలంచుఁ బవలంచు లేక సతత ♦ స్నేహానుసంధానమై
పశులంజేయు సమర్థమై యిహసుఖ ♦ ప్రాలంబమై రమ్యమై
పశుపక్ష్యాది సమస్తజంతునికర ♦ ప్రాప్తంబునౌ భోగమీ
దృశమై వర్తిల జీవముల్ విడుచుటం ♦ తేయోగ్యమైయొప్పదే.

మాద్రి —

చ॥ కిలకిలనవ్వులుం మిగుల ♦ కేకినలుం జెలువైనచూపులుం
జిలిబిలిపల్కులుం గలిగి ♦ చిత్తమురంజిలఁజేయుసంతతిం
గలుగక ఘోరమైన నర ♦ కంబున యాతనలందఁజేయు దు
ష్కలుమత వంధ్యయై బ్రతుకు ♦ కంటెను వేరొకకష్టమున్నదే.

పాండు — చెలీ! దైవవిధి యిట్లున్నదికాన నిఁక నట్టిభోగమ్ములపై నాశవిడిచి వానినెల్ల హీనమ్ములగను ముక్తిమార్గ నిరోధకముగను దలపోయవలెను. నిజమాలోచించిన,

ఉ॥ మాయకుబుట్టినిల్లు, నను ♦ మానని వాసము, కల్ల సత్యముం
జేయు ప్రమాణసీమ, మదిఁ ♦ జింతనఁజేయుఁగ తాపహేతువుం
న్యాయవిరుద్ధమార్గమున ♦ కాకరమౌ రమణీమణిం దృణ
ప్రాయముగాఁదలంచి వన ♦ వాసమొనర్చిన ముక్తిచేకురుం.

కుంతి—ఆర్యా! ఏమి యీవాక్యములు? ఎవరో కులటలయెదుట ప్రసంగించఁదగినది పతివ్రతలగు కులభామినులయెదుట నుడువుట ధర్మమా?

పాండు—ఏమీ! నేనొర్చినది కులటలయెదుటి ప్రసంగమా? మీస్త్రీస్వభావమును వెల్లడించితిని. మీరును స్త్రీలేయగుట మిమ్మును నట్లే భావించితి. ఇంక మీరు నన్నువీడి మననగరమ్మున కేగుఁడు. నే నీవనవాటిక సంచరించుచు,

చ॥ కొలనులలోని నీరమును ♦ గ్రోలుచు కెంజిగాకులైన పా
న్పులఁబవళించుచు న్వివిధ ♦ భూజఫలమ్ముల నారగించుచున్
లలితరసాలనింబ వకు ♦ ళసుప్రియసంగ్రహానైక పర్ణశా
లల నివసించుచున్ మునికు ♦ లంబును జేరి తపంబుసల్పుదున్.

కుంతి—మనోహరా! అర్ధాంగులమగు మమ్మువిడనాడఁజెల్లునే! వివాహసమయమున "నాతిచరామి" యని యనినపల్కులు స్మరించుకొనుఁడు. మీ రెందున్న నాకు నందే నివాసయోగ్యము. నాకు మీరే యేడుగడ. మీతోడిదే లోకము. మిమ్ముఁబాసి త్రుటికాలమైనను అన్యస్థలమున వసింపఁజాలను.

చ॥ విభుఁడు వనంబులోన ముని♦వృత్తిఁ దపంబుననుండి యన్యదు
ర్లభమగు మోక్షముం గరత♦లామలకమ్ముగఁ గాంచుచుండ
యాభము శుభమ్ములేక పుర ♦ మందలి సౌధములందుఁజేరి మేల్
విభవము లందనేర్తుమె భ♦ళీభళి! యెవ్వరువిన్న నవ్వరే!

కాన మీ రేకాంతముగనుండు కాంక్షమాని యీ మీకుల కాంతలతో నుండ ననుగ్రహింపుఁడు.

పాండు—నే నేకతమున రావలదని పల్కితినో గ్రహింపరైతిరిగదా! ఇందువలననే కదా గజయానలకు "సాహసం షడ్గుణం చైవ" యని యార్యులు వక్కాణించినది.

ఉ॥ నీలములైన పెల్ కురులు ♦ నీరజతుల్యముఖంబు మంచి ము
త్యాలె యనంగ రదమ్ములు సు ♦ ధాకలితంబగు వాక్కులుం సదా
లోలునిగా నొనర్చి చప ♦ లుం బచరించెడి స్త్రీ స్పృశించు నా
గాలియు సోఁకుమాలిన వి♦ఘాతముగల్గుఁ దపస్వికెన్నఁగన్॥

కావున మీరు మదాజ్ఞావర్తులై పురంబున కేగుఁడు. మఱియు,

మ॥ సకియల్ గూర్చిన పుష్పమాలికలు కై♦శ్యంబందునన్ జేర్చ నిం
చుక నైపుణ్యము లేని మీర లిఁక ని♦చ్చో నుగ్రదర్వీకర
ప్రకరంబుల్ గలచోట, కాలు కదలిం♦పంగ రాని సాంద్రాటవిం
సకలావస్థలతోడ నన్ను భజియిం♦చంగ వత్తురే వెఱ్ఱులై॥

కాన మీర లిఁకాన వెలువడి నగరమున కేగుటయే యుక్తము.

మాద్రి—మనోనాయకా! తపఃకార్యమ్మునకు స్త్రీ లనర్థదాయకులని నుగ్గడించుచు క్రూరజంతునికరవ్యాప్తియగుటచే మమ్ము రావలదని సెలవిచ్చుచుంటిరి. మీ రెవరిఁగూర్చి తపంబు సేయుచుంటిరో యా శంకరుఁడే—

గీ॥ దేహ మర్థంబు పార్వతీ ♦ దేవి కొసఁగి
మస్తకంబును స్వర్ణదీ ♦ మానినికిడి
ప్రణవమునఁ దాత్మసిద్ధిని ♦ బడయ లేదె?
పడఁతులున్నంత మహిమకే ♦ పాటిలోటు?

సర్వోపచారములు గావించుచు నెట్టి మనఃక్లేశమును గల్గనీయక సర్వదా మీయిష్టానువర్తులమై చరించు మమ్ముల విసర్జించు తలంపునువర్జించి మీపరిచర్య లొనర్చుట కంగీకరింపుఁడు.

పాండు—(తనలో) హా! దైవమా! వీరినిటుల నా వెంట నంటఁగట్టి నాకెట్టి ముప్పు సంఘటింప నుంటివో గదా! నీకృత్యము లలంఘ్యములు కదా! (ప్రకాశముగ) మీ కెన్నిరీతుల బోధించినను నన్ను విడ

నాడుట కిచ్చగింపమిచే మీ సేవల కంగీకరించితి. కాని "పురుషుఁ డాజ్యఘటంబు పొలఁతి దావవహ్ని" అను రీతినిగమనించి మీ హావభావవిలాసముల స్మరణకునైనఁ దెచ్చుకొనక సర్వభోగ పరిత్యాగులై నారచీరెలు తాల్చి కందమూలాదుల భుజించుచు యోగినులై నావలెనే మీజీవితములను గడపుకొనవలెను.

కుంతి—ఇప్పుడుగదా కృతార్థులమైతిమి.

మాద్రి—ఆర్యా! తనుతపోనియమములకు తగుస్థలమును నిర్దేశించి వైళమె మమ్ముఁగొనిపొండు.

పాండు—అటులనే మనకు నివాసయోగ్యమును యోజించుకొని అందొక పర్ణశాలఁగూడ నిర్మించుకొందము.

కుంతి—మన్మనోనాయకా! సంతతిఁగాంచని జన్మము అర్కోదయము లేని దినముగను దీపిక లేని గేహముగను జీవములేని దేహము వలెను ఉదకములేని కొలనువలెను వ్యర్థమనికదా ఆర్యులు పల్కుదురు! ఇఁక మన కట్టిభాగ్యము లేదుగదా! మనజన్మలు తరించుటెట్లు? అందులకైగల నామనోవిచార ముడుగుటెట్లు?

పాండు—మానినీతిలకములారా! మీర లావిషయమై చింతింపవలదు. దేవోపాసనాబలముచే నందరాని యీప్సితములు లేవు. కాన మన కామార్గమువలన నేనంతానభాగ్యము తప్పక లభింపఁగలదు. ఆ యావిషయ మ్ములు సర్వమును మీకనతికాలములో బోధించి మీ కాకొంతిరవ్వంతయుఁ గలుగకుండ నేనొనర్చెదను. ఇంతకు మన మంత్రియగు సుధర్ముఁడు మన యీయవస్థను మాయగ్రజునికిఁ దెల్పియుండును.

కుంతి—ఆహా! యీవార్త గాంధారీదేవికిఁ గర్ణరసాయనముగా నుండియుండవచ్చును.

పాండు—అటు లనవలదు. ఆమెయు విచారించును. పోనిమ్ము. (ఒక ప్రక్కఁజూచి) అదిగో! ఆపర్వతప్రాంతము మనవాసమున కర్హామనితోఁచెడిని. తడయకరండు. వెడలుదము.

(నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము

(కుంతియు, మాద్రియు, పంచపాండవులును ప్రవేశము.)

కుంతి—హా! ప్రాణనాథా! హా జీవితేశ్వరా! కటకటా! మమ్మీఘోరారణ్య మధ్యమున వైచి దిక్కులేని యనాథలఁగాఁ జేసిపోయితివా! ఇఁక నీపసికూనలఁ గాంచువారెవరు? మాకేది తెరవు? హా పరమేశ్వరా! మాంభర్తతోఁ గూడ నీ సాన్నిధ్యమునకేతెంచు మాకు పిల్లలదయచేసి మనసునకు లేనియాగాటము గల్పించితివా! సంతానము లేకపోయెనని యెంతకాలమో వంతఁజెందిన మాకు నీసంతానము నొసంగియు మరింత వంతలపాలు జేసెదవా? ఇఁక నీకుఱ్ఱలకు నీవేదిక్కు. మేముభయుల మిప్పుడే భర్తతోఁ జితిలోఁజేరి భస్మమయ్యెదము. ఓ దీనశరణ్యా! నీ కరుణాకటాక్షముచే నీసంతతి కలిగినదని సంతసించితిమి. కాని మాపూర్వకర్మ వశమునఁ గలిగినదని తలంచమైతిమే. (పిల్లలను జేరఁదీసి) నాయనలారా! మీ కీ యార్తజనశరణ్యుఁడే తల్లియుఁదండ్రియు. మీకై యనేకతపములు మాచే జేయించిన మీ యాతండ్రి మాకారణమున నిట్లు నిర్జీవుఁడయ్యె. భర్తను జేతులారఁ జంపిన కాంతలు వీరేయని లోకనిందకుఁ బాల్పడి నలుగురిచే వ్రేలుమడిపించుకొని భూమిపై మనజాలము. మీరు తల్లిదండ్రులులేని బిడ్డలయితిరే! భగవంతుడు మిమ్మిప్పుడే పెద్దలను జేసి మీతండ్రిని దనకడకుఁ దీసికొనిపోయె. హా! తండ్రులారా! ఈ ఘోరారణ్యమున నీ మృగము

లలో మీరుమాత్రము బ్రతికి బట్టగట్టుట యెట్లో కదా! మహారాజు పుత్త్రులైన మీకు పట్టముగట్టుటపోయి పుట్టకొకరిని చెట్టుకొకరిని విడిపించి పోవుచుంటిమి. పెద్దదాన నగు నేనే ముందు చితిఁ బేర్చి అందులో దుమికెదను (అని పోఁబోవును.)

మాద్రి—అక్కా! మన ప్రాణనాథుని ప్రాణహరణమునకు నేనే కారణమగుట నిక్కమగుటను చితిఁ బేర్చి వారితో సహగమనం బొనర్చెదను. నీ వీ పిల్లలను బోషించుకొనుచుఁ బెంచి పెద్దవారిఁ జేయుము. వారదృష్టవంతులైనచో మనవిభున కిట్టి యకాలమృత్యువు సమీపించునా? కనుక వారి కష్టసుఖముల వీక్షించుచు బ్రతికియుండుము.

కుంతి—చెల్లెలా! పెద్దభార్య నగుటచే శాస్త్రవిధిచే సహగమనమునకు నేనర్హురాలనుగనుక మారుమాటపలుకక నీపిల్లలనుబోషించుచు భూమిపైఁ గొంతకాలము జీవించియుండుము. భర్తతో సహగమనముచేయు యువతీమణికేగదా యుత్తమలోకము. అట్లు కాదేని మన ముభయులము సహగమనము కావింతము. "నారుపోసినదేవుఁడు నీరుపోయఁడా" యనునట్లా పరమేశ్వరుఁడే మనకు మారుగా మనకుమారుల రక్షింపఁగలఁడు. ఱాతిలోనికప్పను పోషించు నాజగన్నాటకసూత్రధారి మన యీ కుఱ్ఱల కరుణమాని విడుచునా! ఈ యరణ్యవృక్షసంతతుల కెవ్వారు నీరుపోసి పెంచిరి? ఆ చిన్మయాకారుని కృపయేగదా! మన నిసువులపై ఆజగద్రక్షకున కావంతదయగలిగెనేని యివి యున్నియు మున్యాశ్రమములేకదా! ఏమునియైనను వీరినివీక్షించి వారి వెతలఁ దీర్పింపఁగూడదా! ఎంతచూచినను దైవసహాయములేని దేదియు సమకూరదు. హా! పరమేశ్వరా!

(ప్రవేశము మాండవ్యుఁడు)

మాండ—బిడ్డలారా! దుఃఖింపవలదు. దుఃఖింపవలదు.

కుంతి—హా పరమేశ్వరా యనునంతలో దుర్భరచింతాసముద్రమ్మున మునిఁగియున్న మమ్ముద్ధరింపఁ బరమేశ్వరావతారముగా వచ్చిన మునిచంద్రా! మీరెవ్వరో కదా! మానమస్కారము లందికొనుఁడు.

మాండ—నేను మాండవ్యుడను. ఇంతదనుక యీప్రాంతముననే దేవపూజార్థము పుష్పాపచయమ్ముఁ జేసికొనుచు మీవృత్తాంతమంతయు నెఱింగితిని. మీభర్తమృతివిషయమై మీరు చింతింపవలదు. "జాతస్యమరణం ధ్రువ"మ్మను నట్లు పుట్టుక గలిగినఁ దిరిగి తప్పక గిట్టుదమని యెఱుంగవలయును. మన ఛాయవలె మృత్యువు మన చేరువనేయుండి కాలము సమీపింపఁగనే తన వాఁత వేసికొనుచుండును. ఈప్రపంచోత్పత్తిగా నెందఱు మహారాజులు ఎందఱు చక్రవర్తులు నశించలేదు! కాని, తనయగ్రజుఁ డంధుఁడై రాజ్యకార్యవిచారణాదక్షతాహీనుఁడైనను తనభుజబలపరాక్రమము చేతను తన మనోబలము చేతను నీభరతఖండంబు దిగ్విజయంబుచేసి సమస్తరాజులను తనయేలుబడి క్రిందికిఁ గైకొని గర్వవిహీనుఁడై తనయగ్రజునకే పట్టముగట్టి తాను యువరాజుగానుండి సేవించుచుండెను. ఇతని సోదరవాత్సల్యమున కా శ్రీరామచంద్రునికి సేవఁ జేసిన భరతుఁడేసాటిగాని మరియొకరుగలరా? తల్లులారా! మీరిరువురును మహాపతివ్రతలు; మీరేమియుఁ జింతిల్లవలదు. మీకు దేవాంశ సంభూతులగు పుత్త్రులు గలిగిరి. వారు బహుబలపరాక్రమవంతులై యఖండయశోవిరాజితులరు కాఁగలరు గాన నాపలుకులాలించి చింతిల్లకుఁడు.

మాద్రి—ఇట్టి కష్టసమయమున మమ్ముద్ధరింపవచ్చిన ఓ మాతండ్రీ! యామాభర్తతో మమ్ముంగూడఁ గడతేర్చి యీబిడ్డలను మీబిడ్డలనుగాఁ గాపాడి రక్షించుఁడు.

మాండ—తల్లులారా! చనిపోయిన మీభర్తకై మనమెంత చింతిల్లి నను జింతాకంతైనను ప్రయోజనములేదు. ఈ శూరశిఖామణికి నేనే యగ్నిసంస్కారమును జేసి మీయుభయులను మీపిల్లలను ధృతరాష్ట్రునియొద్దకుఁ జేర్చెదను. కావున వంత మానుఁడు.

కుంతి—తండ్రీ! యీ బాలురను వారిపెదతండ్రియొద్దకుఁగొనిపోయి పుణ్యముఁగట్టుకొనుము. కాని మున్ముందుమాత్రము భర్తతోడనే స్వర్గ మలంకరింపనిండు.

మాండ—"మాతాహతే జహ్వార సాలభిన్నమ్" అని పిల్లలకుఁ దండ్రి పోయినను జీవింపవచ్చునుగాని తల్లిలేకున్నచో పిల్లలు వృద్ధి నొందరు. కనుక శాస్త్రసిద్ధిచే మీలో నొకరు సహగమన మాచరించి మరియొకరు బిడ్డలఁబెంచి వృద్ధిఁగావింపుఁడు. ఇదియే నామనోభీష్టము.

మాద్రి—స్వామీ! మీ పలుకులు మాకు తొలిపలుకులు. కుంతి నాకంటె పెద్దదియై లోకానుభవ మెక్కుడుకలదగుటచేతను నాకంటె నెక్కువ సంతానము కలదగుటచేతను నాసౌందర్యమే భర్త మరణావస్థకు మూలమగుటచేతను నేనే భర్తతో సహగమన మాచరించెదను. అక్కా! నీవీపిల్లల నభివృద్ధిలోనికిఁ దీసికొనిరమ్ము. నాకు మరుమాట నుడువవలదు. (మాండవ్యునిఁజూచి) జనకసదృశా! నాకు మరణమునకు సెలవిండు. అక్కా! సెలవు. (పిల్లలను కౌఁగలించుకొని) ఇంక ఆమెయే మీకుజనని. (అని దుఃఖముతో వెళ్లును)

కుంతి—అయ్యో! ఇదియేమి యన్యాయము! నన్నువిడిచి నీవొక్కతెవే భర్తతో స్వర్గమున కేగెదవా?

(అని వెంబడించును అందఱు నిష్క్రమింతురు.)

(తెరలోమంట, పాండురాజదహనము కనుపడును)

మాద్రి—(తెరలోవల) ఓ వీతిహోత్రా! నీవప్రభావ మతీతము. నీవు లేకున్న నీ ప్రపంచ మొకక్షణమైనను సాగదుకదా! యాజ్ఞయాగాదిమహాక్రతువులన్నియు నీముఖంబుననుగదా పవిత్రమందుట! జానకీదేవివిషయమున శ్రీమన్నారాయణాంశసంభూతుండగుశ్రీరామచంద్రునికి నీపల్కులేగదా సంశయనివృత్తినొనర్చినవి! అట్టి యోమహానుభావా! నే పుట్టినదాది యెన్ని ఘోరదురితము లాచరించితినో వానినెల్ల వమ్మగునటుల నన్ను నీలో గలుపుకొని నాభర్తతోగూర్చి నాకలోకసుఖము లందింపుము. ఓస్వాహావల్లభా! నమస్తే నమస్తే నమః.

(అగ్నిలో దుమికినట్లు తెరలో ధ్వనివినబడును.)

(మాండవ్యుఁడు ప్రవేశించి)

మాండ—పాండుమహారాజున కగ్ని సంస్కారమును జేసితిని. ఆ కుంతికి గొంతమనశ్శాంతిఁ గొల్పితిని. ఆ మాద్రియు నగ్ని ప్రవేశమై భర్తతో దివికేగెను. ఆ కుంతిమాత్ర మెట్టకేలకు ఆ ఱెక్కలురాని పిల్లలకు సంరక్షణార్థమై తనభర్త ననుగమింపదయ్యెను. కాన నేనికఁ దడయక యీ కుంతీదేవిని పాండవులను ధృతరాష్ట్రమహారాజునొద్దకుఁ గైకొని యేగి వీరి జననవృత్తాంతమాదిగ సర్వము విన్పించి వీరి నొప్పగించి వచ్చెద.

(నిష్క్రమించును)

[తెరపడును]

---




# ద్వితీయాంకము

## ప్రథమరంగము

(ధృతరాష్ట్రుఁడు, భీష్ముఁడు, విదురుఁడు, కన్నులకుగుడ్డకట్టుకొన్న గాంధారియు ప్రవేశము)

ధృత—సోదరా! విదురా! మన రాజ్యమున నెట్టియిక్కట్టు లందక ప్రజలు సుఖులైయున్నారా? సమస్తభూవలయమేలు రాజన్యులఁ దనకింకరులగాఁ గైకొనిన విక్రమవిశారదుండగు మన పాండుభూపతి కాలధర్మము నొందుటాది కొందఱు మానవేశ్వరులు ప్రమత్తులైరని వింటిని. ఇందెంతనిజము?

విదు—ప్రమత్తులై మనల గికురించినపల్కు వాస్తవమేకాని వారినెల్లర మన యర్జునుండు తన భుజపరాక్రమమున పాదరక్షలక్రింది వృశ్చికములవలె నొనరించె. పులికడుపునఁ జలిచీమ పుట్టునా?

ధృత—మనయర్జును పరాక్రమ మటుండ.

శా॥ నాకుం దండ్రిసమానుఁడై విహితనానాధర్మమర్మజ్ఞుఁడై
వీఁకన్ భార్గవరామచంద్రు సమరోర్విన్ శృంగభంగమ్ము గ
న్నాకై చేసినభీష్ముఁడున్, నయకళానైపుణ్య మంత్రాది వి
ద్యాకల్పద్రుమ మీవుగల్గగఁ గొఱంతన్ గాంతునే సుంతయున్.

భీష్మ—వయోవృద్ధుఁడ వగుట నన్నటులందువే కాని నాగాయతసత్త్వుం
డవును సర్వశాస్త్రపరిచయుఁడవును నగు నీప్రజ్ఞ నిరుపమానము
సుమా!

మ॥ కురుభూజాని పురూరవప్రభుఁడు ఋ♦క్షుం డల్లదుష్యంతుఁడున్
భరతుండాది నృపాల పాలిత ధరా♦భారమ్ము నిర్వక్రిఁ
బరిపాలించు యశోనిధానమవు నీ ♦ భాగ్యమ్ము నేమందు నూ
ర్గురు పుత్రుల్ భళి! దోస్సౌటవలె మా♦కు న్నేత్రపర్వంబిడున్.

గాంధా—ఆర్యా! ఇదియెంతయు మీపెద్దల యాశీస్సుగదా!

భీష్మ—తల్లీ! మణులహారములోని నాయకమణివలె పతివ్రతలలో
జానకీదమయంతులకును నగ్రగణ్యవుసుమా!

సేవ—(ప్రవేశించి) ధృతరాష్ట్రమహారాజా! తమ దర్శనార్థమై ద్వై
పాయనులవారు వచ్చి ద్వారమందు నిలిచియున్నారు.

ధృత—సేవకా! తక్షణమే వారిని లోనికిఁ గొనిరమ్ము.
(వ్యాసుఁడు ప్రవేశించును. అందఱు లేచెదరు)

ధృత—పరాశరాత్మజా! నమస్కారములు. ఆ రత్నసింహాసన మలంక
రింపుఁడు.

భీష్మ
విదు } మునీంద్రా! నమస్కారము.

గాంధా—ఆర్యా! నమస్కారము. (అందఱును గూర్చుందురు)

(వ్యాసుఁడు రత్నపీఠమునఁ గూర్చుండును)

వ్యాసు—మీరందఱు కుశలమేకదా?

ధృత—భవదీయకృపాగరిమచే మేమందఱము కుశలులమై యున్నా
రము.

వ్యాసు—గాంగేయా! పూతచారిత్రులగు పాండవులకును దుర్యోధ నాది కురువీరులకును క్షేమమేకదా!

భీష్మ—దేవరవారి యాశీస్సున నట్లే.

విదు—వ్యాసమునీంద్రా! ఇంతకుమున్ను మీరప్పుడప్పుడువచ్చి ధర్మ ప్రసంగములుచేసి మాకు విజ్ఞానమొసంగుచుండెడివార లిప్పు డన్ననో అంతగా దర్శనమిచ్చుట లేదు.

వ్యాసు—విదురా! నాపయింగల భక్తి ప్రేమలచే నటులందువు కాని మొన్న నేకదా

చ॥ కలకల నవ్వులాడెడు మొ♦గంబులతో కడు నిబ్బపడ్డముల్
భళియని సంస్తుతింప మన ♦ పాండవ కౌరవ పుత్రులెల్ల ను
జ్జ్వలతర క్షేమసువిభవ ♦ సంపదచే నిశితాస్త్రశస్త్రకౌ
శలమును జూపునట్టి తరి ♦ సమ్ముదమంకుచు నిం దెయుండనో.

గాంధా—మహాత్మా! ఆడబోయిన తీర్థ మెదురైనయటుల నామనంబున భవదీయాగమనంబు వాంఛింప నాపూర్వకృతపుణ్యంబున మీ రరుదెంచితిరి. తమరెప్పుడును పురుషులు తరించు మార్గములు బోధించుచుందురు కాని స్త్రీజనమునకు ధర్మార్థకామమోక్ష ఫలప్రదమగు నదెద్దియేని నొకవ్రతరాజం బానతీయరుకదా.

వ్యాసు—బిడ్డా! సౌబలీ! అటులైనవినుము.

మ॥ పతిభక్తిం వహించి నిత్యమును ద♦త్పాదాబ్జసంసేవనా
యుతకౌతూహల చిత్తమైవరలి స్వ♦ప్నావస్థయందైన సూ
నృతవాక్యప్రతి యాచు నిత్యము భవా♦నీధ్యానయుక్తాత్మ యా
సతి కెవ్వారలుసాటికాగలరు వా♦స్తవ్యమ్ముగా సౌబలీ!

గాంధా—దేవా! లోకసామాన్యముగా జెప్పినటుల నుడివితిరి. మీ వలన నేదైన సద్వ్రతంబునువిని దానినొనరింపనుంటిని.

వ్యాసు—తల్లీ, సుబలాత్మజా! అట్లైనవినుము. మీ స్త్రీజనమ్మునకు వ్రతములలో నుత్తమంబగు నైరావతవ్రతం బొండుకల దది యాచరింపదగు. అదియెట్లులంటేని, ఇంద్రుఁడు వాహ్యాళికై వెడల స్వారిచేయు నైరావతగజంబును తోడితెచ్చి యొక శుభవాసరంబున రక్తోత్పలమ్ములగంధాక్షతల యథావిధిఁ బూజించి శక్తికొలఁది బ్రాహ్మణపూజసేయు సకల కామ్యంబులు సిద్ధించును. కాన నీవటులొనర్పుము.

గాంధా—ఆర్యా! అటుల లభ్యమ్ముకానిచో నెటులొనర్పవలెను?

వ్యాసు—కానిచో నైరావతగజమును మృత్తికతోనైన నొనర్చి వ్రత సంపూర్తి నొనర్పుకొనవలెను. కురువంశజులారా! నాక నుష్ఠానమునకు వేళయైనది. వెళ్ళివచ్చెద.

ధృత—శీఘ్రముగా మాకు పునర్దర్శన మిత్తురుగాక!

(వ్యాసుఁడు నిష్క్రమించును)

ధృత—పురాణశ్రవణమునకు వేళయైనది. కాన నేటికికొలువుచాలింతము.

(గాంధారి తప్ప సకలు నిష్క్రమింతురు)

గాంధా—(తనలో) దైవకృపచే నింతవర కేకొఱంతలేక ననుభవించుటకు వలసినంత యైశ్వర్యము కలిగి రాజ్యము కలిగి నూర్గురు పుత్త్రులు కలిగి పుత్త్రిక కలిగి సమస్త బాంధవులలో వన్నెవాసిఁ గలిగియున్న యిప్పుడే యేవ్రతమునో దానమునో చేయుటకు వలనుపడును. కావున నాయగ్రతనయుఁడగు సుయోధనుని బిల్చి యీ వ్రతరాజము పరిపూర్తియొనర్చుటకు నైరావత దిగ్గజమును దెచ్చుట కేమనునో అడిగి తెలిసికొనియెద. కాని తన చెలికాడగు కర్ణునితోఁ గూడనేని యైరావతగజమేకాదు అమరావతీ పట్టణమే తెచ్చి యిక్కడ నిల్పఁగలఁడని తలంచెద.

(గాంధారి నిష్క్రమించును.)

---

## ద్వితీయ రంగము.

### గాంధారి మందిరము.

గాంధా — శుభకార్యమ్ము లొనర్చుట కీవసంతఋతువే యోగ్యమైనది కాన తప్పక యీమాసములోనే నా వ్రత మొనర్పవలయును. ఏలనో మా సుయోధనునకు కబురంపినను రాలేదు. కాని యువరాజై రాజకార్యనిర్వాహకుఁడై యున్నవాని కెన్నెన్నో పను లుండును. అయినను నా మాటకు జవదాటియెఱుఁగఁడు.
(అని యనుకొనుచుండగా దుర్యోధనుఁడు ప్రవేశించును)

దుర్యో — తల్లీ! నమస్కారము.

గాంధా — ఆయుష్మాన్భవ!

దుర్యో — జననీ! మీ రేలనో కబురంపితి రద్దానినిఁ దెల్ప వేఁడుచున్నాఁడ.

గాంధా — నాయనా! సుయోధనా! పెక్కు వాసరములనుండి యెద్దియేని పుణ్యవ్రతం బాచరింప కుతూహల మందుచుండుటే కాని నెర వేరినదికాదు. నిన్నటిదినమున నీవిషయము వ్యాసమునీంద్రులకు విన్నవింపఁగా నైరావత మను వ్రతరాజము కలదనియు దానికి నైరావత దిగ్గజమును రక్తోత్పలమ్ములఁ బూజించవలెననియు సెలవిచ్చిరి. కాన నీవ్రతరాజమ్మును నాచే నొనర్పించుటకు సంసిద్ధుఁడవు కమ్ము.

దుర్యో — (ఆలోచించి)

మ॥ జననీ! పుష్కల నీలమేఘముల చం♦చద్దివ్య శంపాలతల్
గొని రానేర్తును, సాగరోదకము సాం♦గోపాంగ మేతంబుచే
తనునింకింతును; డప్పికిచ్చెదను పా♦తాళమ్మునీరమ్ము, నిం
ద్రునిదైరావతముం గొనంగ మివులన్ ♦ దుస్సాధ్యమై తోఁచెడిన్.
కావున తల్లీ! దుర్లభంబగు నీవ్రతమ్మున కెట్లు సమ్మతించితివి?

గాంధా—నాయనా ! సుయోధనా!

ఉ॥ ఇత్తెరఁగున్ బొనర్పఁగ ముని♦శ్వరుఁ డానతియిచ్చినంత మ
చ్చిత్తమునందు సంశయము ♦ జెందుచు నట్లొనరింపలేని చో
నత్తరి యేక్రియన్ సలుప ♦ నొనని ప్రశ్న నొనర్పఁ దత్కరిన్
మృత్తికచే నొనర్పఁగ ము♦నిప్రభుఁ డాజ్ఞ నొసంగె ప్రేముడిన్.

కావున నాయైరావతమును మృత్తికతో నొనర్చియైనను నా వ్రత సంపూర్తి నొనర్పుము.

దుర్యో—తల్లీ! భవదాజ్ఞ యవశ్యకరణీయముగదా! శిరసావహించి యటులే యొనర్చెదను. ఇంక వెళ్ళివచ్చెదను.

గాంధా—బిడ్డా! యీ వ్రతమ్మును సకలబంధుజనసమక్షమున నొనర్చుటకు కుతూహలమున్నది కాన బాహ్లిక సోమదత్తాదిబంధువర్గమును కుంతీసహిత పాండవులను సామంతప్రభువులు మొదలగువారి నా యాప్తుల నాహ్వానించి గౌరవింపుము.

దుర్యో—మాతా! భవదాజ్ఞ మరియొకలీల జరుగునా? నాకింక సెలవిమ్ము. వెళ్లివచ్చెద.

(దుర్యోధనుఁడు నిష్క్రమించును)

గాంధా—నేడే దైవజ్ఞుల రావించి దివ్యమగు సుముహూర్తము మద్వ్రతరాజమ్మునకు స్థిరీకరించునట్లొనర్చెద. ఇపుడే మాపుట్టినింటివారిఁ దోడ్కొని వచ్చుటకుఁ దగినవారినిఁ బంపునటులను వ్రతమునకుఁ గావలసిన వస్తుసామగ్రి సమకూర్చుటకును దగినవారిని నియమించునటుల నా ప్రాణేశ్వరునకు విన్నవించుకొనెదను.

(అని నిష్క్రమించును)

---

## తృతీయరంగము

(వీరావధానియు, కాశీభొట్లు ప్రవేశము)

వీరా—కాశన్నా! గాంధారీదేవిచే జేయఁబడిన వరావత వ్రతమునకు వచ్చితివా?

కాశీ—వీరన్నా! నేనుగాని శుభాశుభ కార్యములు కలవా?

వీరా—అట్లయిన సదస్సులో నా కగుపించలేదేమి?

కాశీ—అచ్చోట నొకరికొకరు కాన్పించుచునట్లున్నదా? ఇసుముచల్లిన రాలుట కెడములేక లక్షలకొలఁది వచ్చిన విప్రులలో నీ వెక్కడనో నేనెక్కడనో?

వీరా—నీకు ఫలితమెంత? వేదమంతయు సాంగాధ్యయనము చేసితివిగదా!

కాశీ—భుక్తాయాసముగానున్నది. నన్నించుకతడవు పలుకరింపకుము. కొంచెము విశ్రమించి సర్వము సావకాశముగ విన్పించెదను.

(అని పవ్వళింప యత్నించును)

వీరా—అగే కాశీభొట్లు! ఎన్నిబొబ్బట్లు ఎన్నిమాపచక్రము లెక్కించితివిగా అంత శ్రమఁజెందుచున్నాడవు?

కాశీ—నాలుగుపుంజీలకు పైబేగమేకాని తక్కువయుండఁబోవు. నన్నిప్పుడు బాధించి దాహోయతునిగ నొనర్చునది నే నాస్వాదించిన శేరుఘృతమే. మనస్నేహితుఁ డచ్యుతరామశాస్త్రి వచ్చుచున్నట్లున్నది.

(అచ్యుతరామశాస్త్రి ప్రవేశము)

వీరా—ఏమోయీ! అచ్యుతరామా! మన గాంధారీదేవిగారొనర్చు వ్రతమున నీకుఫలితమెంత? మన మెఱుఁగినది మొదలెన్ని మా

కార్యములు గావించువారిని వీక్షించితిమిగాని యిన్నిదానధర్మములఁజేసి యింతవైభవముగా నొనర్చినవారిని మన మెవ్వరినిఁ గాంచము.

అచ్యు—జనకుని యాజ్ఞోల్లంఘన మొనర్చెడు ఈ దుర్యోధనుని దానములకు నీవే సంతసింపుము. అగ్నిహోత్రునకుఁదోడు వాయుదేవుఁడటుల యీ యోగ్యులేని దుర్యోధనునికిఁ దోడు కపటశీలుఁడగు శకునికూడ చేరినాడు.

కాశీ—(స్వగతము) వీనికేమియు ఫలితము లేనటులఁ దోచుచున్నది. తద్వ్రతము నుతించుచుపల్కిన నాపై నాగ్రహించును గాన వానినే అనుసరించెద. (ప్రకాశముగా) ఓరీ అచ్యుతా! గోడకు చెవులుండును. కాన మన ప్రభువుఁగూర్చి నిందఁ గావింపకుము. ఎవరైన నాలించినచో మోసము వాటిల్లును. పెదవిదాటిన పెన్నదాటునని వినవా?

అచ్యు—అట్టిభయములు నీకుఁగాని నా కేమాత్రమును లేవు. ఈయన మాయామాయుఁడు కలఁడుగాని లోకములోకము మాయకున్న ...నా? అతని దుర్గుణములను గూర్చి యెవరు చెప్పకొనరు? ఎందరినో బంధువులను సామంతుల నాహ్వానించి గౌరవించెను గాని పుణ్యవర్తనులగు పాండవులను కుంతీదేవిని పిలువఁడయ్యెగా!

వీర—అవును ఇదివాస్తవమే. ఎల్లరవలె గాక ముఖ్యబాంధవులగు పాండవుల నవశ్యమాదరించ వలసినదే. రాజ్యమెల్లనువారిపితామహార్జితంబగుటయు విశేషించి వారిపితార్జితంబగుటయు వారే వాస్తవముగా రాజ్యమున కధికారులు. కాని వారితండ్రిస్వర్గస్థుడగుటచే వారికిఁ గొంతకాలమువఱకును రాజ్యసిద్ధి చేకూరదు. అనతికాలము క్రిందట నొకనాడు కందుకక్రీడ నాడుకొను సందర్భమున దుర్యోధనుఁడును భీముఁడును నొకరినొకరు నిందించుకొనిరట! అదియెట్టిదో నీవెఱుంగుదువా?

అచ్యు—ఎఱుంగనేమున్నది? వనములో జన్మించితిరి గాన మీరు మృగతుల్యులని దుర్యోధనుఁడనెనట! అంతట వాయునందనుఁడాగ్రహించి మీతల్లి యొకపశువును బరిణయమాడెగావున మీరును పశుతుల్యులే యనెనట!

వీరా— అదియెట్లు?

అచ్యు—గాంధారి జన్మించిన కాలమున నచ్చటి కొక మునివచ్చి యీమెను వివాహమాడిన వాఁడనతికాలమున మృతి నొందునని చెప్పెనట! అంతటతద్దోషపరిహారార్థము సుబలరాజుతనకూతును నొక మేకపోతునకిచ్చి పెండ్లిచేసి దానిని తనకరవాలముచే దెగటార్చెనట! తరువాత ధృతరాష్ట్ర మహారాజునకు కరగ్రహణం బొనర్చెనట!

కాశీ—అయితే సుబలరాజు తన సుతకు పునర్వివాహము చేసెనందువా? తరువాత?

అచ్యు—కర్ణుండు పరిహాసముగ దుర్యోధనునితో "మిత్రమా! వారి పుట్టుకయే విచిత్రము గదా వారితో మాటాడ గలవా?" యనెనట!

వీరా—వరుల యున్నతిని విని సైపఁజాలని కర్ణములుగల యీ కర్ణుఁడు గదా వీరల వైరమునకు మూలము. తరువాత భీముఁడేమనెను? వారు మాత్రము అంధునిసుతులు కారా యనెనా?

అచ్యు—మా పుట్టుకలకేమి నీవు మాత్రము నిన్ను సాకుచున్న సూతునికే జన్మించితివా యని భీముఁడనెనట!

రా—చాలవరకు వచ్చినదే! అందువలననే పాండవులకీ వ్రతమున ప్రవేశము జరుగలేదు. కాని "మా కాయుష్యము మా కారోగ్య" మను దుర్యోధనుఁడిన్ని దానములఁ జేయుచుండెఁ గాని ఆలోచనలో దుష్టుఁడైనను దానము చేయుటలో కర్ణుఁడు మేరుపర్వతమునైనను వెనుచూపులేక తృటికాలములో దాన మొనర్చును.

అచ్యు—పరులసొమ్ము దానము నర్పు మసిన నేనును అంతవాడనే!

వీరా—అయితే వీరి కలహములు సందర్భమున ధృతరాష్ట్రు డెట్లు ప్రవర్తించును?

అచ్యు—పాండవుల నన్యాయ మొనర్పు కడుపున విషముండినను లోకమునకు వెఱచి తియ్యనిమాటలనుడువుచు ప్రేమఁగలవానివలె నటించుచుండును. దుర్యోధనుని జన్మకాలముననే ఉత్పాతములు తోచుటచే ఆర్యులానాఁడే వీని దుంపుమనినను పుత్త్రమోహమున దుంపజాలక కొడుకు దుష్టుఁడైనను 'సుయోధనా' యని మాటిమాటికి బిల్చుచు వాని యిష్టానుసారము సర్వము నడపుచుండును.

కాశీ—(జనాంతికముగా) వీరావధానీ! వీనితో ప్రసంగము చెట్టుగొట్టి పైనవేసికొనినట్లే. వెళ్లుదము రమ్ము (ప్రకాశము) మే మొక కార్యార్థమై వెళ్లుచున్నాము. నీవుకూడ వచ్చెదవా అచ్యుత రామా?

అచ్యు—అటులే (అని అందఱు నిష్క్రమింతురు).



# అర్జున ప్రతిజ్ఞ

## తృతీయాంకము

### ప్రథమరంగము

వారణావత నగరము : కుంతీదేవి మందిరము

కుంతి—(విచారముతో) ఆహా! యెంత విపరీత కాలమయ్యెను! గాంధారి వ్రత మొనర్చికొనుచుఁ బిలువదాయెను. ఎంతలో నెంతయయ్యెను! భర్త కాలగతిఁ జెందఁగనే యా చితిలోనే యతని సహధర్మచారిణినిఁగూడ బూడిదఁజేసెడు సహగమనాచారమేమహానుభావుఁడు శాసించెనో! నాబోటి అనాథల దీనాలాపముల నెన్నిఁటి నాలకించి యా మహామహుని హృదయము కఱఁగి నీరైపోవునో! ఆ పుణ్యచారిత్రు శాసన ముల్లంఘన మొనర్చినందుకుఁ దగిన శాస్తి యనుభవించితి. మాద్రి యెంత సుకృతవతియో యీ పుడమిని యిడుములందక భర్తృపాదారవిందసేవఁ గావించుచు సర్వసౌఖ్యాకరంబగు స్వర్గమునను౦డె. "అపుత్రస్య గతిర్నాస్తి" అను వాక్యమును నమ్మి పుత్రులు లేక లేక వగచి వగచి, దైవతములఁ బ్రార్థించి ప్రార్థించి తత్ప్రసాదముచే యోగ్యులగు పుత్రులం బడసినందులకు నా హాస్తినాపురముఁ బ్రవేశించుటాది వారి జీవితమే సంశయాస్పదమైయున్నది. అదేమిపాపమో సార్థకనామధేయుఁడగు దుర్యోధనుఁడును, పాండవద్వేషియు బద్ధమత్సరుఁడునునగు కర్ణుఁడును సతతము నాబిడ్డల గాంచిన నోర్వలేరైరి. అందు ముఖ్యముగా భీమునిఁగాంచినఁ గన్నులలో నిప్పుకలు పోసికొనుచుందురు. ఆ దుష్ట దుర్యోధనుఁడు వానినిఁ జంపింప నెన్నిపనులఁగావించె?

సీ॥ ఒడలెఱుంగక నిద్ర ♦ నొందుచుండెడివానిఁ
గీళ్లను ద్రాళ్ల బి♦గించినారు
ఊపిరిమూన్ప మా♦యోపాయము నొనర్చి
మున్నీటిలోపల♦ ముంచినారు
ఆరగింపుప్రసాద ♦ మందున నొకతూరి
కాలకూట విషంబుఁ ♦ గలిపినారు
బుస్సుబుస్సను కృష్ణ ♦ భుజగమ్ములను దేహ
సంధుల కఱపింపఁ ♦ జాలినారు

గీ॥ సమయ మబ్బిననేని యే ♦ సరణినైన
నసురులను దీయనుంకించు ♦ చున్నవారు
కటకటా! యిట్టి దుష్టసం ♦ ఘమ్ములోన
కొడుకుకుఱ్ఱలగాపాడు ♦ కొనుట యెట్లొ?

వారిజనకుండు జీవించి నేను మరణించినను వీరి కిన్ని యిక్కట్లు రానేరవుకదా; ఏమహారాజపుత్త్రికనో తిరిగి పరిణయమాడి సర్వ సౌఖ్యము లనుభవించుచు సుతులఁ బోషించుకొనుచు పెండ్లిపేరంటములఁ జేసి విద్యాబుద్ధుల నేర్పించి యెంతయౌన్నత్యదశలోనికిఁ దెచ్చి యుండునోకదా! వసుధపై జన్మమెత్తుటయే దోషంబు. అద్దానిలో యువతియై జన్మించుట మహాపాతకంబు; అందునను భర్తృవిహీనయైన తద్దురితమ్మునకు మేరయే లేదు.

సీ॥ శుభకార్యముల కేగఁ ♦ జూచుజనమునకు
కంటకంబౌట యే ♦ కాంతబ్రతుకు
శయనోద్ధత వికచ♦నయనులౌ ప్రజలకు
గరళమై యొప్పుటే ♦ కాంతబ్రతుకు
ఆప్తబంధువులెల్ల ♦ హైన్యతఁ జూపింప
కడగండ్ల కెక్కు యే ♦ కాంతబ్రతుకు
ఇంచుకేనియుఁ గాని ♦ యిహలోక సౌఖ్యముల్
కాంక్షింప రాని దే ♦ కాంతబ్రతుకు

గీ॥ చందనాగరు కస్తూరి ♦ సంచయంబు
కనుల వీక్షింపరాని దే ♦ కాంతబ్రతుకు
కనుల జలమును గార్చునే ♦ కాంతబ్రతుకు
అట్టి విశ్వస్థబ్రతుకు కిల ♦ వ్యర్థముకద.

ఏ కాంత సుమంగలియై సపుత్రకముతో నోలలాడుచు స్వర్గస్థురాలగునో ఆ కాంతయే ధన్యురాలు. ఆ కాంతయే పుణ్యవతి. పరులచే నెంతపరాభవము వచ్చినను సహింపవచ్చునుగాని బంధువులలో [illegible] గలుగు పరాభవంబు మా స్త్రీజనంబునకు దుర్భరము. ఆమె హృదయమెట్టి పాషాణమో, కాదు వజ్రమే యనవచ్చును. పట్టణములోని ముత్తైదువులపాలికి సేయంజాలనైతినిగదా; ఈ కట్లుశిలనము కొడిగట్టినది గాంధారియై యుండునా లేక దుష్టశీలుండగు సుయోధనుండై యుండునా?

(అని ఆలోచించుచుండగ నర్జునుఁడు ప్రవేశించును.)

అర్జు—తల్లీ! నమస్కారము.

కుంతి—బిడ్డా! చిరంజీవి నయ్యా.

అర్జు—తల్లీ! ఏల దీనముఖమ్మునను౦డి యేదియో విచారించుచున్నట్లు తోచుచున్నది. నీ దైన్యతకు హేతువేమి!

కుంతి—పగులకొంపకుఁ గూటికి గుడ్డకుఁ జేరిన మనకు దైన్యముగాక సంతోషమా?

అర్జు—జననీ! మనము పరులగృహమున నేలయుంటిమి? మనరాజ్యమున, మన పట్టణమున, మన గృహమ్ముననే యుంటిమి.

కుంతి—వారిపజ్జకుఁ జేరితిమనికదా గాంధారితలంపు.

అర్జు—"యద్భావం తద్భవతి" యనునట్లు యేనాటికైనను వారికే యైన నట్టిదుస్థితి చేకూరునేమోగాని ముమ్మాటికిని మనకట్లు

నాటిల్లదు. తల్లీ! నీ విచారకారణము నుఱువునంతవరకు నాకు మానశ్శాంతి చేకూరదు. కాన వైళము వచియింపుము.

కుంతి—ముంజేతి కంకణమున కద్దమేలయనినట్లు నేపలుక నేల? మొన్న మీా పెదతల్లియొనర్చిన యైరావతవ్రతరాజమున మనము వారికిం గన్పింపక పోయితిమిగదా!

అగ్జ—జననీ! ఇదియ తయు కపటశీలురగు దుష్టచతుష్టయముది కాని పూజ్యురాలగు నాయమదికాదని తలంచెద. పోనిమ్ము! వృద్ధరాజైనను విచారించినవాఁడుకాఁడు. (ఆలోచించి) పయోముఖ విషకుంభమునుబోలు ఆయన మానస్థితి విచారించునా? పూజనీయులగు విదుర భీష్మాదులకు వెలచి యించుకైనను మమ్ము మన్నించుచుండెను. కాని లేనిచో విన్నన్న చెప్పినదివేద మనునట్లు ఆ ముద్దుల కొడుకగు దుర్యోధనుఁడు గీచినగిరిదాటక వానివాక్యము లాలకించి మమ్మేమియొనర్చియొండునో? అయినను తల్లీ! విచారింపవలదు. కాలచక్రము తిరుగుచుండును. కష్ట సుఖములు మారుచుండును. సిర్వక్రపరాక్రమ వంతులగు నీ సుతులమేనిలో నూపిరికల్గునంతవరకు నీకేకొఱంతయుఁ గలుగదు. వారు ఐరావతమును మృత్తికతో నొ...కదా వ్రతము సేసిరి.

వ॥ గరుడుల్ యక్షులు కిన్నరుల్ దివిజ సంఘంబుల్ సురేంద్రుండు సో
ద్ధురులై సన్నుతిరింపనీ, హరుఁడు తోడ్తో వారికిన్ నాయమై
యురుగన్ బూనిన బూననీ బలిమి నే నైరావతీ దివ్య ది
క్కరిసిన్ దెచ్చి వ్రతమ్ము సర్వఁగఁ బ్రతిజ్ఞన్ బూనితిన్ నమ్ముమీా.

కుంతి—కుమారా! దుస్సాధ్యములగు కార్యములయందు బాల్యచాపల్యమునఁ దొందరపడి ఘోరప్రతిజ్ఞలఁ బూనకుము.

అర్జు—ఐరావతమొకటియే కాదు

సీ॥ నర్తనమ్మునను మే♦నక ఘృతాచీరంభ
లైన గీర్వాణవే♦శ్యాజనంబు
త్యాగంబొనంగఁగ ♦ దారిద్ర్యవిధ్వంసి
యై విరాజిల్లెడు ♦ దేవసురభి
పరిమళామోద సౌ♦భాగ్యమ్మునను నిత్య
సౌరభావహ పారి♦జాత తరువు
వాహ్యాళి వెడలఁగ ♦ వన్నె చిన్నెలు గల్గి
జవచారియైన యు♦చ్చైశ్శ్రవంబు
గీ॥ వీని వ్రతమున కేను దె♦ప్పింప కున్న
నిత్యసత్యవ్రతుండును ♦ నృపవరేణ్యుఁ
డౌ యుధిష్ఠిరు పదపద్మ♦మాన నేను
పావకజ్వాలలందున ♦ భస్మ మగుదు.

కుంతి—(తనలో) వీనికి రోషము శ్రుతిమించి రాగమునఁబడినది. కాన నీపాటికి పొమ్మనియెద. (ప్రకాశము) తండ్రీ! బుద్ధిని బృహస్పతిఁ బోలు మీ పెద్దన్నగారికి నీవిషయము తెల్పుము. ఇంక పొమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము

ధర్మజ, భీమ, నకుల, సహదేవులు ప్రవేశము.

ధర్మ—సోదరులారా! మనకష్టము లంతయు గాంచుచున్నటిరో గదా? అందు మనభీమునిఁ బెగటార్చుటకు దుష్టచతుష్టయ మెన్నియో ప్రయత్నములు సేయుచుండెను. దైవసాహాయ్యమున నవియన్నియు నిష్ఫలంబు లగుచున్నవి. లేకున్న మనమేమి చేయఁగలము!

భీము—అగ్రజా ! పుణ్యమూర్తులగు దేవర ప్రభావమె మమ్ము గాపాడఁగలదు. వారి సేతలకు నేను రవ్వంతయు జంకను.

ధర్మ—అనుజులారా!

ఉ॥ ఎట్టి ముహూర్తమందు జనియించినవారమొ తోచదాయెగా
పుట్టిన దాది కష్టముల బొందుటె కాని సుఖమ్ము లేదిసీ
కట్టడి దైవ మెందులకుఁగా సృజియించెనొ ఖ్యాతిగాంచు న
మ్మాత్రుకులమ్మునందు గతిమాలిన వారినిగా నొనర్చుచున్.

"కష్టేఫలే" అనునట్లు మున ముంకేనాఁటికైనను సుఖింపకుందుమా?

భీము—అగ్రజా! ఏల మనము వారి కొదిగిళ్ళు బడుచు నిడుమలందుట?

మ॥ కపటోపాయము లేమి లేక పితృభాగం బీయ కాదంచుగా
విపరీతప్రతిభాషలాడ కదనోర్విన్ మత్తమాతంగ మె
ట్లపురూపమ్ముగ నంబుజంబుల ననాయాసమ్ముగాఁ ద్రుంచు న
ట్లపాడిన్ జేతు సుయోధనాది శతమున్ లీలావినోదక్రియన్.

ధర్మ—సోదరా! మనకుఁగల్గు కష్టములచే నటులనుడివెదవు కాని యక్షౌహిణీలకొలంది సైన్యయుతుఁడై రారాజై వెలుఁగొందు వానిని మనము తేఱిచూడఁగలమా?

నకు—అన్నయ్యా! ధర్మనందనా! ఏలయీ ట్లధీరాలాపములు? క్షత్రియోచితధర్మము విడిచి కానన సీమల మునివృత్తి నుండుటయే మీ మనోరథము. కావుననే మాకిట్లు పిఱికిమందుపోయుచుందురు.

ధర్మ—సహదేవా! నీయభిప్రాయమేమి?

సహ—"అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అనునట్లు కాల క్రమాగత కష్ట సుఖము లనుభవింపక మానవుండేమి చేయఁగలఁడు? అందు నూరకున్నవారికి నూరెల్ల నోపదుగదా!

ధర్మ—నాయనా! సహదేవా! చిన్నవాడవైనను చక్కగా వాక్రుచ్చితివి. నేఁడు మనయర్జునుఁడు కానుపింపలేదేమి?

సహ—పూజ్యురాలగు కుంతీదేవిగారిని దర్శించుటకు వెళ్ళి యిదే వచ్చుచున్నాఁడు.

(అర్జునుఁడు ప్రవేశించును.)

అర్జు—దేవా! అజాతశాత్రవా! ఇవే వందనములు.

ధర్మ—మనోవాంఛా ఫలసిద్ధిరస్తు. అర్జునా! తల్లిగారి కడకేగితివా?

మ॥ ప్రతినిత్యమ్మును దాసికానివహసేవల్ గాంచుచున్ సమ్మదిం
గుతుకంబందుచు నిట్టి హైన్యదశయున్ ♦ గోరంతయున్ లేక సం
తతమున్ భక్తిపురస్సరంబుగ మహా ♦ దైవార్చనాశీలియై
వ్రతరాజమ్ములు దానధర్మములు సల్పన్ బుద్ధియోజించునే?

భీము—అర్జునా! ఏమైనవిశేషము లున్న మొకల దాచక వచియింపుము.

అర్జు—సోదరులారా! తినఁబోవు కూరగల రుచులడుగనేల? చెప్పెద సావధానముగా వినుండు. కతిపయదినమ్ముల క్రిందట గాంధారీదేవిగారైరావతవ్రత మొనర్చుచు మనజననిగారిని మనలను పిలిచి గౌరవింపనందులకు కినిసి "ఎంత దుర్దశ వాటిల్లె" నని విచారించుచుండ "గాంధారీదేవి మైరావతిగజముచు మృత్తికతో నొనర్చికదా వ్రతము సల్పినది. జననీ! మీరునిజమైన యైరావతగజమున నొనర్పుఁడు" ("గరుడుల్" "నర్తకీ" అను పద్యములు జదివి) అని ప్రతిజ్ఞనొనర్చి వచ్చితిని. దేవరవారి యనుజ్ఞలేక యిట్టిప్రతిజ్ఞగావించి వచ్చినందులకు క్షమించి తల్లిగారివ్రతసంపూర్తినొనర్చి ఆయమగారి మనోవేదన మాపనగుంతుదుగాక!

ధర్మ—అర్జునా! ఎట్టిప్రతిజ్ఞ బూనితివి! ఇందుకైనను స్వబల పరబల విచారణ వలదా?

మ॥ నవదీక్షాపరతంత్రయుక్తినియమో♦త్సాహంబునన్ ధారుణీ
దివిజుల్ హవ్యములేరికిచ్చెదరొ త♦ద్దేవేంద్రుతో నిష్ఠ డా
హవమున్ సల్పి యనన్యసాధ్యమగు నా♦ యైరావతం బెట్లు దె
త్తువు? శక్యంబగునంచు బూనితివె; యిం♦ద్రున్ దోమగా నెంచితే.

సహ — మానవాధములగు దుర్యోధనాదులతోఁ బగ తెచ్చుకొనుటకే భీతిల్లెడు అన్నగారిమనమున కిది మరియు విషాదకరము.

భీమ — ఒకసోపానమునే యెక్కుటకు భీతిల్లెడువా రద్రిశృంగముల కెక్కఁగలరా? అయినను "సమాతుః పరదేవత" యనినట్లు తల్లిగారి నిమిత్తమున నెన్నియిడుములు వచ్చినను తదాజ్ఞ లవశ్య కరణీయములుగదా!

మ॥ నవమాసమ్ములు మోసి కాంచి పసిలో♦నన్ భర్తయీల్గన్ మునీ
నివహాప్రాంతముఁ జేరి కష్టములతో♦నే చింతచేమ్రగ్గి యే
యువతీరత్నము పెంచెనో మనల నా♦ మాహామణీసద్వ్రతం
బవు గాదంచు వచింపకే సలుపు మా♦ర్యా కీర్తి సంధిల్లగన్.

అర్జు — అన్నయ్యా! స్త్రీలకు సాహస మధికము గనుక ఆయమ ప్రాణత్యాగమున కొడిగట్టునని అట్లొనర్చితి. కావున

మ॥ ఒక దేవేంద్రుఁడు కాదు నూరుగురుగా ♦ నొక్కుమ్మడిన్ వచ్చినన్
సకలారాతిగణంకనుంగవయి శ♦స్త్రప్రక్రియానైపుణిన్
సుకరంబౌగతిగా గ్రహింపఁగల ని♦చ్చో నభ్రమాతంగ మిం
దుకుదప్పన్ జననాజ్ఞ మీరినటు లెం♦తున్ సోదరగ్రామణీ!

మ॥ కులభూమీధరపంక్తి క్రుంగిన చతుః♦కూపారముల్ తీక్ష్ణతన్
జలరాహిత్యముఁ బొందినన్ నభసి న♦క్షత్రాళి వే డుల్లినన్
గలతేజమ్ములు చంద్రసూర్యులు విడం♦గాని మిన్నకేమైన మ
త్తిలియున్నట్టిబిడౌజునోర్చి కరినిం♦దెప్పింతు దథ్యంబుగన్.

సహ—అగ్రజులారా! తొలుతనే వాసవుపై దండెత్తి పోరాడుకదా! ఆ పురుహూతుఁడు మనతల్లిగారివ్రతమున కైరావతముకావలెనని చెప్పిన నాచొప్పున కొప్పుకొనునేమో? మనలో మన మింత వితర్కించుకొననేల? అయినను మనకు కుడిబుజమువలె శ్రీకృష్ణులవా రుండ కొదువయేల?

ధర్మ—అనుజా! ఎంత యమాయకుడవు? అడుగగనే భయపడి యిచ్చుట కాతడంత పౌరుషహీనుఁడా? ఎట్లైన సద్దానినిఁ గొనితెచ్చుటకు సంగ్రామము తప్పదు. కాని సామదానభేదదండోపాయములఁ గార్యసాధన మొనరించుకొనుట యుత్తమము గనుక మెవ్వరినైన నొకని చతురిని దూతగా బంపుదము. ఆవల దైవకృతి మెట్లున్నదో యటులఁ గాగలదు.

భీమ—మన కోరినరీతి నొసంగఁడేని నాఫలిత మతఁడే యనుభవించును. నేఁ డీయకున్నను శక్రునితో సంగ్రామరంగమ్మున నిలిచి పోరాడువేళ కాళ్లు చల్లబడినప్పుడైన నొప్పఁడా!

మ॥ మన తేజమ్ముగ్ర బలమ్ముగ్ర దుర్జయులఁ దున్మాడంగ నోగాక వీఁ
కను దుర్యోధనునిన్ జయించు టొకలెక్కా సింహకిశోర మే
న్గను మొక్కన్ గనుకొంచుగాని తృణమున్ జూపింప భక్షించునే?
అనఘా! సందియమేల వజ్రిపయి పోరాడంగ నే నోర్చెదన్.

ధర్మ—సోదరులారా! మీరింత పూనికగా వాక్రువ్వ నే కాదననేల? జననిచే వ్రతము చేయించుటకన్న సంతోషకార్యమింకొకటి యున్నదా? అయినను నీవిషయమై పెద్దలగు భీష్మాదులతో యోజించి యెవరినైన సందేశహారునిబాపుట యుక్తమని యూహించెద.

సహ—పెద్దలతో యోజించుట కిప్పుడావమునకు సన్నద్ధముగ పాకశాసనుని రమ్మనుచుంటిమా? మాతల్లిగారి వ్రతమునకు మీ యైరావతమిచ్చెద రాయని యొకదా పంపనున్న సందేశము!

ధర్మ—ఈసందేశమున కేవ రర్హులు?

అర్జు—నిత్యమును మనపేర్మికై ప్రాతిబలాడుచు మన మందిరమున వర్తించు సోమనాథవర్మను బంపించుడి.

భీము—అవును. అతఁడే అన్నివిధముల యోగ్యుఁడు.

నకు—అతఁడువెళ్ళినఁ దప్పక కార్యసిద్ధి గాంతుము.

సహ—జాగేలనర్చనేల? ఆతనివను బిలిపింపుడు.

ధర్మ—ఎవఁడురా అక్కడ?

సేవ—(ప్రవేశించి) దేవా! యుధిష్ఠిరమహారాజా! జయము! జయము!

ధర్మ—సేవకా! నీవు సత్వరమున నేగి సోమనాథవర్మను దోడ్కొని రమ్ము.

సేవ—చిత్తము మహాప్రభూ! (అని సేవకుఁడు నిష్క్రమించి తిరిగి ప్రవేశించి)

సేవ—స్వామీ! సోమనాథవర్మగారు దయచేసిరి.

ధర్మ—తక్షణము లోనికిఁ బ్రవేశ పెట్టుము.

సోమ—(ప్రవేశించి) ధర్మరాజాదులారా! ఇవియే నావందనములు.

ధర్మ—ఆయుష్మంతుఁడవు కమ్ము.

సోమ—పూజ్యులారా! నన్నుఁ బిలిపించిన దేలొకో దయయుంచి నుడివెదరా?

భీము—మాసందేశ మొకదానిని దేవేంద్రునికిఁ జేర్చుటకు నొక వార్తాహరుఁడు వలసి నిన్నుఁ బిలిపించితిమి.

నాకు—ఆర్యులారా! దేవేంద్రునితోడనా! ఏసందర్భమున?

అర్జు—మాజననిగారు ఐరావతవ్రత మొనర్ప నెంచిరి. తత్సందర్భమున.

సోమ—ఆ వ్రత మెట్లొనర్పవలెను?

సహ—కతిపయదివసములక్రింద మాపెదతల్లిగారగు గాంధారిదేవిగా
రొనర్చిన వ్రతవిషయము మెఱింగియు మమ్మడిగెద వేల?

సోమ—అయితే సురాధిపునితో నేమి పని?

సహ—వా రైరావతకరినిమృత్తికతో నొనర్చిరి. మే మిప్పుడు నిజమైన
యైరావతముతోడనే వ్రతమొనర్పుటకుగా వాంఛించి తద్వృ
త్తాంతము మీచే వాసవునకు దెలుపనుంటిమి.

సోమ—వీరమూర్తులారా! నే నమరావతికేగి దేవేంద్రునితో నేమిగా
పలుకవలయునో సెలవిచ్చెదరా?

ధర్మ—సోమనాథవర్మా! శచీధవునితో నా మదువులుగా నిటు లనుము

ఉ॥ దేవసమూహామంతటికి దేవరవై యజనాదికర్మ భూ
దేవకృతార్చితుండవయి దివ్యగతిన్ శతయజ్ఞకర్త వా
దేవ! మదీయమాతృ భవదీయకృపన్ వ్రతముం బొనర్చ నై
రావత మిందుబంపుము కరమ్ము ప్రియమ్మున బాకశాసనా!

భీమ—నావచనము లిటులని పల్కుము:

చం॥ యమసుతుఁడిట్లు మేటివినయమ్మునఁబల్కుట ముందిఁ కెన్నఁడో
సమరమునందు నిల్వఁగ నశక్తతఁగాదు గురుత్వముంచుచుక్
దమకును మాకు మైత్రి వితతమ్ముగఁ బెంచెదు కోర్కెగావ శీ
ఘ్రమున కరీంద్రముంపు వ్రతరాజమొనర్పఁగ మేఘవాహనా!

అర్జు—నా సందేశ మాలకింపుము. పౌరుషము పొందులాభము అను
నుడి మీ కెఱుంగనిది కాదు కావ,

క॥ క్షీరోదకమ్ములట్టుల । మీరున్ మేముందుకోర్కి ♦ మిమ్మర్థింపన్
మారాడకుండ బనుపుమి। యైరావతదిగ్గజమ్ము ♦ నమరాధిపతీ!

ఈరీతినుడువనాపల్కులు పెడచెవికిఁ దార్చనేని యిటు లనుము.

ఉ॥ ఈశుకృపావిశేషమువ ♦ హించిచరించుచుఁ బల్మిగాంచుచున్
శైశవమాది నేటికిని ♦ శత్రులగుండెలలోని బల్లెమై
కౌశలమింతఁ గల్గి జయ ♦ గర్వులమై విహరించినాము నా
కేశ! దురమ్మునందున గ ♦ జేంద్రము పొందకపోము నమ్ముమీ!

సోమ—నకుల సహదేవులారా! మీ రేమైన విన్నింపుమనెదరా!

నకు—విన్నింప నేమున్నది? సర్వమును మా యగ్రజులే తెల్పిరి. గ్రహరాజు ననుసరించి చరించుగ్రహములవోలె మా యగ్రజు మార్గమే మా మార్గముకదా! అయినను గోరితివి కాన స్వావాక్కులుగా నిటు లనుము.

మ॥ చతురశ్వమ్మున స్వర్గమేలుచు సుర ♦ శ్లాఘానుపాత్రుండవై
దితిసంతాన లతాకుఠారమువునై ♦ దివ్యానుభోగుండవై
ప్రతిభం గాంచిన మీకు వేయినుడువన్ ♦ భావ్యంబొకో ... మా
వ్రతసాంతమ్మొసరింపుమీ త్వరితమే ♦ పంపించుమీ త్వత్కరిన్.

మీ రెన్ని క్రతువులొనర్చి యెంత మహత్వము వహించినను న్యాయమార్గానువర్తులమగు మా మనోభీష్ట మీడేర్పరేని నూరు నోములు నోచి యొక్కతప్పొనర్చిన గతి మీ యశంబెల్లను పంచబంగాళమగునని యనుము.

సహ—పసివాడని తలంపక నా మనోభిప్రాయముఁ గూడ నాలించి పోయిరమ్ము.

సోమ—మహాత్మా! అటులనకుము. ప్రాయమున లేతవారైనను బుద్ధి విశేషమున వృద్ధులని నే నెఱుంగనే; మీరును సెలవిండు.

సహ—

చం॥ సతతము గురుండు వాఁడొను ప్రసంగములన్ వినుచుండఁగల్గి స
ద్గతి నెమకంగఁ జాలు జడదారుల నెయ్యము లందు దేవ! యీ
క్షితిని నరుండు పుట్టుకను జెందఁగ నీవు కృపయొనటఁ జేసి మీ
సుతుల విధమ్ము నెందలఁచి గొంపుగ బంపుము స్వర్గనగేంద్రముల్.

ఈరీతికి సమ్మతింపఁజేసి తొందర కిట్లనుము.

చం॥ పలువురతోడ నెయ్యమున వర్తిలుటల్ యశమున్ వహించుటల్
దలఁప నసాధ్యమౌను; జడదారులఁ ద్రొక్కుచు నెల్లవారిచే
ఖలుఁ డనిపించుకొంట తృటికాలములో ఘటియిల్లుఁగాన మా
పలుకుల నాదరించి బుజుపద్ధతిమై కరి నంపుమీ వెసన్.

సోమ—నే నిఁక వెడలవచ్చునా? మీయట్టి మహాత్ముల యనుగ్రహ
ముండుటఁ జేసి యమరావతి ప్రభుదర్శనము లభింపనున్నయది.
నే నెంతయు ధన్యుఁడను.

ధర్మ—సుహృద్వరా! సందేశహరా! తొలుత హస్తయుగ్మము మోడ్చి
వినయ ప్రోధేయ పూర్వకముగా మామాటలఁ దెల్పి తమ
పరి సామాద్యుపాయమ్ముల త్వత్ప్రతిభా విశేషముఁ జూపి
కార్య సాఫల్యమగునటు వర్తింపుము.

సోమ—పరదేవికటాక్ష మాలవాలముగను త్వదనుగ్రహవిశేషము
నను మచ్ఛక్తి కొలఁది వర్తించి యరుదెంచెద.

(సోమనాథవర్మ నిష్క్రమించును.)

ధర్మ—అర్జునా! నీవు వీని ననుసరించి వెడలి మనకుఁ జేదోడు వాదో
డును పరమేశ్వరావతారుఁడునునగు శ్రీకృష్ణుని యొద్దకేగి సర్వ
మును నివేదించి ఆయాదవప్రభుని సౌంభక విమాన సాహా
య్యమున వీనిని అమరావతి నగరమున కంపుము.

అర్జు—చిత్తము. (నిష్క్రమించును.)

ధర్మ—భీమసేనా! యేతద్విషయము లాలించి శ్రీకృష్ణుఁ డెంత ఆగ్రహించునో కదా!

భీము—అగ్రజా! మీ రటుల తలఁపవలదు. మన మొనర్చినది న్యాయవిరుద్ధము కాదు. కాన ఆగ్రహించుటకు మారుగా ఆనందించు నని తలఁచెద.

నకు—నా యభిప్రాయంబును నదియే. ఏలన, తాను మేఘవాహనుఁ డౌట ప్రపంచమున సస్యవృద్ధికి తానే హేతుభూతుఁ డనియు యాదవు లందరును అతని నొక యీశ్వరావతారునిగఁ బూజింప వలయు ననియు అటులఁ గాకున్న వర్షశూన్య మొనర్చి సర్వసస్యనాశ మొనర్పఁగల ననియు శచీకళత్రుఁడు గర్వించియుండుటచే నయ్యది శ్రీకృష్ణునికి వెల్లటుగాఁ దోఁచి యేదేని మిషచే వాని గర్వాపహరణముఁ గావింప యత్నించుచున్నట్లు జనశ్రుతి కలదు.

సహ—ఇయ్యదియే ధ్రువమైనచో లీలామానుషవిగ్రహుఁడగు నా గోపాలకృష్ణుఁడును మనకు సాయమై మన యీప్సితము వేర్పఁగలఁడు.

ధర్మ—అనుజులారా! ఏది యెటులఁ గానున్నదో మన మెఱుఁగఁగలమా? అతిథిపూజకు వేళయైనది. కాన మనమిఁక జాగొనరింపక వెడలుదము రండు. (అందఱు నిష్క్రమింతురు.)



గీ॥ తపసులును రంభలును వితతమ్ము కాఁగ
కాంచుకొలఁది స్వర్గస్వర్గమై ♦ గ్రాలె; యిట్టి
సుమనసారామ సుమనస ♦ క్రమముఁ జూడ
తనువు పులకించె నాజన్మ ♦ ధన్యమయ్యె!

(కొంచెము నడచి) వహ్వా! యేమి యీ బదరికాభూజశ్రేణి! మున్ను నరనారాయణులు తపమొనర్చిన దివ్యవృక్షముల క్రిందనే కావలయును; లేక బదరికావన మింకెందైన కలదేమో! (కొంచెము నడచి) ఓహోహో! యీముందు కనుపించునవి అశోకవృక్ష పంక్తివలె నున్నవే! (సభవంకజూచి)

ఉ॥ త్రేతను రామదూతయయి ♦ ధన్యుఁడు వాయుసుతుండు లంకలో
సీతను గాంచనేగి ఫల♦సిద్ధివహించె నశోకవర్తియై
యీతరి పార్థదూతనయి ♦ యిప్పరిఁ జొచ్చి యశోకవర్తినై
చేతము పల్లవింప ఫల♦సిద్ధివహించెద ద్వాపరంబునన్.

(కొంచెము పరిక్రమించి) అద్దిరా! యీవచ్చు కమ్మతావు లెక్కడివి! ఆఁ! తెలిసినది. ఇవిగో! యీపారిజాత కుసుమములవియే. ఏమీ! గంధవహా! కనులఁ గనపడవు. నీ యుపకారమునకు యెవి చేసిన తగదు! చేయుమన్న నుపకారముల చేసెదనే; యీయమనిన సత్కారము లిచ్చెదనే; తుదకొక పూలమాలికనైన నాబుణముఁదీఱ నీగళమున వైచెదనే! (ఆలోచించి) ఏమి నాశక్తి! యీపరిమళము పారిజాత కుసుమములది కాని యీప్రకృతివనమునిదే మిక యదు? ఇంత పరిమళవంతములుగలవి గనుకనే శచీపతి తనయారామమున నెంతో ప్రేమగ పెంచుచున్నాడు. (కొంచెము పరిక్రమించి) ఆ కనుపించునది మందాకినికాబోలు! ఏమీ! అందులోని పద్మములు హేమమయములుగ నున్నవే! యేమి యీవింత! మాభూలోక నదులలోవలె అడుసు కనుపడదే! నక్రమత్స్యాదిక్రూరజంతువులు కానుపింపవే! అంతా సువర్ణమే! ఏవస్తువు దిలకించినను మాలోకమునకును దీనికిని హస్తిమశకాంతరముగ నున్నదే! ఈ గంగఁ గొందఱు జహ్నుపుత్రిక యందురు. మరికొందఱు

సోమ — వెనుక బోయిన తీగ కాలికి తగిలినట్లు నీవు గనుపించుట నాకు సుఖావహము. నీకు సర్వమును మార్గమధ్యమున వినిపించెద గానదయయుంచి నడువుము.

మాణి — అట్టులయిన శీఘ్రమే వారిదర్శనము చేయించెదను రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

---

## ద్వితీయరంగము

### ఇంద్రుని దర్బారు

(ఇంద్రుఁడు, బృహస్పతి, పులస్త్యుఁడు ఉందురు)

ఇంద్రు — దేవగురూ! యెమిన్నైన ధర్మముల వినిపించి నామదికి ముదముఁ గూర్చుఁడు.

బృహ — దేవేంద్రా! నాధర్మము లాలించుటకు నీకు నావకాశమే లేకుండెఁగదా! ఒకవైపున నక్తంచరుల దుష్టచర్యలకు భీతిలి వచ్చు మునీంద్రుల బన్నములఁదీర్చి ఆమాయరక్కసులతో పోరాడి వారిని జయించుటయు మరియొకప్రక్క జడదారు లొనర్చు జన్నములకేఁగి హవిస్సులు గొనుటయు నింకొక మూల దేవతారాజ్యమును పరిపాలించు కార్యక్రమము సర వేర్చుకొనుటకే అవకాశము లేదుకదా! ఒకవేళ నొకత్రుటి కాలము తీరికఁగల్గినచో యెరంభనో యెయూర్వశినో రప్పించి గానన్యాట్యములచే ప్రొద్దు గడుపుచుండెదవు. అయినను ప్రజ్ఞా శాలివి యగుటను సర్వశాస్త్రముల నామూలాగ్రముగ వింటి విగదా!

ఇంద్రు — స్వామీ! మీరు నుడివినట్టుల నీ మాయారాక్షసుల రూపు మాపుటకే నాజన్మ సరిపోవుచున్నది.

పుల — మహేంద్రా! మీరటుల రేయింబవలును విధివిరామము లేక ఆరక్కసిమూకలను యమసదనమున కంపుటచేతనే మావంటి జడదారులు జంఝానిలమునకును ఆరిపోవని కాచకుంభ దీపికలవలె నూపిరితో నుండగలిగిరి. అయ్యయ్యో! అదుష్ట దానవుల చెయ్దములను దలంచిన యొడలు కంపమెత్తును.

సీ॥ వృక్షశాఖలయందు ♦ వ్రేలాడగట్టిన
కావివల్వల చింపి ♦ గానిచనరు
పూత హోమాగ్నులు ♦ భుగభుగమని వెల్ల
గా మూత్రముల నార్చి ♦ గానిచనరు
కనులు మూసితి మేని ♦ ఘనసర్పములఁ దెచ్చి
గళమున తగిలించి ♦ గానిచనరు
వారల పొడగాంచి ♦ భయమున నొదిగిన
గడ్డమ్ములను లాగి ♦ గానిచనరు
తే॥ గీ॥ వింతమృగములఁ జేసి ని♦శ్చింతగాను
మమ్ము పీడించు రక్కసి ♦ మాయగాండ్రు
నగములెల్లను బిండిపిం♦డిగ నొనర్చు
కఠిన కులిశమ్ము చేగాని ♦ కనరు మృతిని.

కాన నోపాకశాసనా! మావంటి జడదారుల భయము లేకుండ చేయుటచే నీ కెంతయోని పుణ్యము కలదు. ఇప్పుడు బదరికాశ్రమము నందు మే మొక యాగ మొనర్చుచున్నారము. కాన మాకు నీ దితి సుతులవలన గల్గువ్యథలు మాన్పి హవిర్భాగంబులంగొని మా జన్మంబును జన్మంబును పవిత్రవంతంబు గావింపుము. ఇందులకే వచ్చితిగాన ఇక నేనరిగెద.

ఇంద్రు — పులస్త్యఋషీంద్రా! మీరు చనుడు. నేను యెల్లియే సత్వరంబుగ బయలు వెడలివచ్చెదను. (పులస్త్యుఁడు నిష్క్రమించును.)

బృహ—వజ్రపాణీ! శ్రీ మన్నారాయణుఁడనేకావతారముల నెత్తి అసుర విసరముల యుసురుల కసి మసంగుచుండినను తామర తంపరగా నీరక్కసిమూక రూపుమాయ లేదుకదా!

ఇంద్ర—స్వామీ! అవును. భవదనుగ్రహముచేతను బుషీంద్రుల మంత్రబలముచేతను నావజ్రాయుధముచేతను నెంతపనిచేయు చున్నను

మ॥ అసమానంబగు దుష్టవృత్తి కుహనవ్యాసారులై సన్మునీం
ద్రసమూహమ్మున కన్నోబన్నములు కార్పణ్యజాలియున్నట్టి ర
క్కసిమూకల్ వధియించ నెంచు టొక సూక్ష్మంబౌ లవిత్రంబుచే
త సమూహమ్ముగు వృక్షముల్ నరుకు చందంబయ్యెగా గీష్పతీ!

బృహ—అవును. వారి దేశికుఁడగు భార్గవునిచే నొసఁగబడు సంజీవిచే మృతిచెందిన దానవులెల్ల పునర్జీవులగుచుండిరని కర్ణాకర్ణికగా వినియున్నాఁడను.

(మాణిభద్రుఁడు ప్రవేశము)

మాణి—సురాధిపా జయము! జయము! దేవరవారి హాజారము వెలుపల భూతలమునుండి మానవుఁడొకఁడు శ్రీకృష్ణసహాయమున పాండవమూర్తియై వచ్చి తమదర్శనమునకై వేచి యున్నాఁడు.

ఇంద్ర—దేశికేంద్రా! పాండవులకును మనకును రాయబార మేమి? అందు శ్రీకృష్ణుఁడు కూడ వారికి తోడుపడుటేల? ఇది వింతగ నున్నదే!

బృహ—సహస్రాక్షా! దీన వింత యేమి కలదు? పాండవులకు నీతోడ నేదేని యొకకార్య ముండి యుండవచ్చును. వారల కాకార్యనిర్వహణమునందు వారి ముఖ్యబాంధవుఁడగు శ్రీకృష్ణుఁడు వారి రాయబారి నిచటకు బంపుట కేదో విమాన మొసంగియుండ కూడదా! ఇంతలో ఆతురత యేల? వానిని రావించి సమగ్రముగ తద్వృత్తాంత మరయరాదా?

ఇంద్రు—సేవకా! వానినిఁ బ్రవేశపెట్టుము.

(సోమనాథవర్మ ప్రవేశించును)

సోమ—సురపాలా! ఇవే పదివేల వందనములు.

ఇంద్రు—ఆపీఠ మధిష్ఠింపుము.

సోమ—(పీఠముపై ఆసీనుఁడై)

సీ॥ సౌఖ్యాకరంబైన ♦ స్వర్గరాజ్యము ప్రేమ
మించగ సతము పా ♦ లించువాఁడ
జడదారిజన్మముల్ ♦ సఫలతవహియించ
హవ్యభాగంబుల ♦ నందువాఁడ
దుష్టదానవకోటి ♦ దుండగమ్ములుమాన్ప
వజ్రాయుధమ్ము చే ♦ పట్టువాఁడ
నిర్జరాచార్యుని ♦ నిరతమ్ము సేవించి
శాస్త్రార్థముల ప్రొద్దు ♦ జరుపువాఁడ

గీ॥ నిరుపమానందముగ రంభ ♦ నృత్యమాడఁ
జేయుచు సుమనఃపిక్షించుచు ♦ చేల్పుతేజ
చిన్నవిన్నపమొకటి ♦ చేయువాఁడ
పాండవుల రాయబారినై ♦ వచ్చినాఁడ.

ఇంద్రు—నీవు పాండవదూతవని యిప్పుడే మాభటునివలన వింటిని
నీ సందేశమేమియో నుడువుము.

సోమ—వజ్రపాణీ! పాండవజననియగు కుంతీదేవిగారు రావతవ్రతమొన
రించెదరట! తద్వ్రతమ్మునకు తమపట్టపేనుఁగు వలసి వినయ
ప్రార్థనాపూర్వకముగ పాండవులు తమ సందేశము నాచే పంపిరి.

ఇంద్రు—ఏమీ! నాపట్టపేనుఁగునే వలయుననిరిగా! ఇదియంతయు
శ్రీకృష్ణుని చూచుకొనిన గర్వమా! లేక నరునియస్త్రకౌశల్య
విజ్ఞాన ధూర్తతయా! వారెంత కుశలులైనను మాగీర్వాణ

గణమును కన్నెత్తి చూడఁగలరా! కానిమ్ము. వారేమిసందేశమంపిరో వినఁగోరెద. వినిపింపుము.

సోమ—(యథోక్తముగా పంచపాండవుల సందేశపద్యములువిన్పించును.)

ఇంద్రు—(కోపముతో) ఆచార్యోత్తమా! వింటిరా వారి దంభప్రలాపములు! ఏమీ కాలవైపరీత్యము! వారిశక్తిని మాశక్తిని పరమాణు పర్వతసామ్యమని యెఱుంగరుకాబోలు! ఇట్టి అర్జునులును గిర్జునులును భీములును గీములును దశసహస్రయుతులైనను నన్నుఁ దేఱిచూడఁజాలరని గుర్తింపలేరు కాబోలు!

బృహ—(తనలో) అతఁడుమాత్రము భవత్తనూజాతుఁడు కాఁడా!

ఇంద్రు—సురాధిపతియంతవాఁడు మనకొక్కఁడెట్లు మన్నించునని యైన యోజింపక లజ్జవిడిచి నాకే సందేశమంపిరిగా! అవును. వారలకేమి లజ్జ! ఆ ధృతరాష్ట్రునిచే నొసఁగఁబడు దినవెచ్చముచే జీవించువారికి లజ్జయెట్లుండును? రాజ్యముపోయినా రాజకళలు పోలేదనినట్లు నవఖండ మండలాధిపతి యగు ధృతరాష్ట్ర రాణియగు గాంధారి యీవ్రతమొనర్చిన విగతభర్తృకయు భిక్షాధికారియగు కుంతియు నేతద్వ్రత మొనర్పవలయునా! ఒకవేళ నొనర్చినను వా రొనర్చినరీతి నైరావతదంతిని మృత్తికతో నొనర్పరాదుగా! అవును "వినాశకాలే విపరీతబుద్ధి" యనునట్లు వారికీ దుస్సాహసము ప్రాప్తించియుండ నాసుయోధనునికిఁబోలె సుయోజనెట్లుతోఁచును? అహో! ఏమి! వారి కండకావరము!

మ॥ ఎవరో నల్గురు నీచమానవులు మీరే దివ్యమా దేహపా
టవముంగల్గిన వారలంచనగి కట్టా వారు తబ్బిబ్బులై
అవురా సన్నదిరింప సాగిరోకా! సింహాంబానె శ్వానంబు సం
స్తవముం జేయఁగ; పాండుపుత్త్రకులు నీచత్వంబుకుం జొచ్చిరే!

ఇంతయేల! ఓపాండవదూతా! నీవుచని నామాటలుగా నిటుల
నుడువుము.

సీ॥ సింహంబుతో గ్రామ♦సింహంబు డీకొని
యుద్ధానిచే జయం ♦ బందెనేని
పులిపిల్లపై యీగ♦పులిపడి ఆకస్మి
కంబుగా మ్రింగగాఁ ♦ గలిగెనేని
సామజపోతమ్ము ♦ సామజపోతమ్ము గా
వించుచో వెన్కజూ♦పించెనేని
జవములోన వినతా♦శాబకమును బక
మెప్పుడేగాని జ♦యించెనేని
గీ॥ కొండపిండినిఁ జేయు ను♦ద్దండునన్ను
కడిమిజయమంది పట్టప♦గ్గములులేక
నేండ్లనుంబూండ్లు స్వర్గమ్ము ♦ నేలవచ్చు
ధర్మరాజు స్వకీయసో♦దరులుగలిసి.

చ॥ తుడిచియు కూరుచుండి నను ♦ గొట్టగవారలు కత్తినూరి దుం
దుడుకుతనమ్ముచే వడిని ♦ దుంపలుదంపలు చేసికొంచు ని
క్కడి కరుదెంచి యుద్ధమున ♦ గాసిలి జీవములన్ దృజించినన్
విడువక స్వర్గమందనుభ♦వింతురు సౌఖ్యములా సహోదరుల్

చ॥ గడగడలాడి మీరదుగు ♦ కైవడిగా వడిగా కరీంద్రమున్
పుడమికిఁబంప మీదయిన ♦ పోమ్యములోపలి బంటగాను నీ
కొడుకుల మన్నమాత్రమునె ♦ గొంతెమకోర్కెలు దీర్పబోను మీ
కడిమికి భీతిఁ జెంది కృప♦కై పడిగాపులుగాయ నమ్మడీ.

చ॥ అసురగణంబె నానుడి శి♦లాత్తరమంచుఁ దలంప మూఢులో
కములును తీక్ష్ణమైనయధి♦కారముచే నడిపించు నన్ను గ
ర్వమునను బంపు మిప్పు డయి♦రావతమంచును మీరుకోర స్వ
ర్గమునె యొసంగనుంటి యయి♦రావతమొక్కటియేల యాజినిన్,

ఓ పాండవదూత! నీవేగి నాచెప్పినసందేశము వినిపించి దేవేం
ద్రుఁడును యుద్ధసన్నద్ధుఁడై యుండెనని చెప్పుము.

సోమ—మహేంద్రా! సెలవుగైకొని యెద.

ఇంద్రు—వేగము చనుము. (సోమనాథశర్మ నిష్క్రమించును.)

దేశికోత్తమా! నేటికి సభ చాలింతమా? ఒకవేళ అవసరపడుచో
సమర మొనర్చుటకు సన్నద్ధముగా నుండవలయునుగదా!

బృహ—అవును. వారల సందేశవు తిరుగాంచిన వార లాహవ క్రీడకుఁ
దలపెట్టునట్టుగనే యున్నది. బాల్య చాపలమున నొక వేళ నర్జు
నుఁడు నీపైకి దురముగావింపవచ్చినను బెక్కువిధముల నీవు
వానిని మన్నింపఁ దగియున్నది. వారు దేవాంశచే భూమిపై
జన్మించిన నరులుగాని కేవల నరులుగారు. మున్ను బదరికాశ్ర
మమునందు తపంబొనర్చిన నరనారాయణులను మునీంద్రులలో
నరుఁడుగాని అర్జునుఁడు కేవల నరుఁడుకాఁడు. ధర్మరాజు
యమాంశచేతను భీముఁడు పవనాంశచేతను నకుల సహదేవు
లశ్వనీదేవతల యంశచేతను జనించిరి. అర్జునుని పుట్టుకకు నీవు
కూడ కారణభూతుఁడవే కాన నీబోటి సర్వజ్ఞునకు విశేషించి
తెల్పవలయునా?

ఇంద్రు—గురూత్తమా! వీరిట్లు దేవాంశలచే భూమిపై జన్మించుటకు
హేతువేమి?

బృహ—భూభారము మాన్పుటకుగా వీరిట్లు భూమిపై జన్మించిరి.

ఇంద్రు—అదెప్పు డెట్లుగా జరుగగలదు?

బృహ—కొలఁదికాలములోనే పాండవధార్తరాష్ట్రులకు ఘోర
యుద్ధము జరిగి సర్వజననాశమై భూభారముడంగును.

ఇంద్రు—స్వామీ! యిక వెళ్ళుదము. (ఇరువురు నిష్క్రమింతురు.)

౩ రంగము.

అమరావతీసమీపమున బయలు.

ఇంద్రార్జునులు యుద్ధసన్నద్ధులై ప్రవేశము.

అర్జు—దేవేంద్రా! నమస్కారము.

ఇంద్రు—(స్వగతము) ఇతనినిఁ గాంచిన నా జయంతునివలె ప్రేమ గల్గుచుండినను నితని వలన ముందు అనేక మహత్కార్యములు కావలయును గనుక ఇంచుక యితని శక్తి పరీక్షించెద. (ప్రకాశము) అర్జునా! నీవు చంకదుడ్డు శరణార్థివిగానున్నాడవే! వ్రీడావిహీనుఁడవై నాతో యుద్ధ మొనర్చుటకువచ్చి నాకు నమస్కారమను చున్నాడవా!

అర్జు—ఇందు తప్పేమున్నది. మీరన్ని విధములఁ బెద్దలు. జనకసదృశులుగాన నమస్కరించితిని.

ఇంద్రు—అట్లెఱింగియు నాతో నాహవము సేయవచ్చుటేల?

అర్జు—అది వ్యవహారధర్మము.

ఇంద్రు—అందులో నూతనము మేము పెద్దలముకామా?

అర్జు—కావచ్చును. కాని సంగ్రామరంగమునకు రావలసి వచ్చినది.

ఇంద్రు—పెద్దలనగా వృద్ధులనుకొని ననుగెలువవచ్చితివా ?

అర్జు—జయాపజయములు నిర్ణయింప మనకు వలనుపడునే?

ఇంద్రు—అర్జునా! నన్ను గెల్చుటకు త్రినేత్రునికైనను వలనుపడదనగా నీవెంతలోని వాడవు?

అర్జు—త్రినేత్రునికైనను వలనుపడకుండుట నీకు సహస్రనేత్రము లుండుట చేతనా?

ఇంద్రు—ఏమి అర్జునా! నన్ను హేళన మొనర్చుచుంటివా? మున్ను మీ తండ్రి మునిశాపవశమ్మునఁ గాదె కాల ధర్మమొందుట. అది నీవెఱుంగవు కాబోలు! నీవు నన్ను హేళనమొనర్చుట గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్లున్నది.

అర్జు—అటులైన మాతండ్రిగారికిని మీకును మునిశాపమునకు హేతు వొక్కటియే యగునా?

ఇంద్ర—ఎటులయిన నేమి? మీతండ్రి మునిశాపహతుఁడు కాఁడా?

అర్జు—కాకేమి, తమది స్వయంకృతాపరాధము; వారిది అనభిజ్ఞాపకారము. వారు మీవిధముగా

సీ॥ జారుఁడై సన్ముని ♦ సదనప్రవేశుఁడై
కోడియై నడిరేయి ♦ కూయలేదు
చోరుఁడై పరసతీ♦హారుఁడై దూరుఁడై
తనువుపై వేకనుల్ ♦ దాల్పలేదు
భీరుఁడై రాజ్యవి♦చారుఁడై దానవుల్
దోలఁగ గహనముల్ ♦ దూరలేదు
ఆర్తుఁడై యాగముం ♦ చనివిని రక్తుఁడై
మృష్టాన్నమని పరు♦గెత్తలేదు
గీ॥ అమృతభాండమ్ము పక్షీంద్రుఁ ♦ డపహరింప
ఘనులమంచును పెక్కుబిం♦కాలదోలి
అరయగ ఘృతకోశాతకీ ♦ న్యాయమునకు
తగిన ధీరుఁడు కాఁడు మా ♦ తండ్రిగారు.

ఇంద్ర—మీతండ్రిగారి విషయ మటులుంచుము; వారు పరలోకగతి నుండిరి. ప్రస్తుతము మీవిషయము నుడువుము.

సీ॥ కూటికై గుడ్డకై ♦ కొంపకై అలో పాలో
యనుచు దుఃఖించు మీ ♦ జననిసతము
మెట్టవేదాంతియై ♦ మిట్టపెత్తనములు
తడవుగాఁ జేయు పె♦ద్దన్నయెపుడు
మూటికి ముడివేసి ♦ పోచికోల్ తిండికై
ఆసించుచుండు చి♦న్నన్నయెపుడు
అచ్చునుబొడిచిన ♦ యాబోతుల విధాన.
యిరువురు తమ్ములు ♦ తిరుగుచుండ్రి

గీ॥ వీరి కాహారమును దెచ్చి ♦ పెట్టలేక
కంటనీరు మున్నీరుగా ♦ కార్చికొనుచు
అలసుయోధను నాజ్ఞల ♦ నడఁగిమడఁగి
బ్రతుకుచుండెడు నీదొక్క ♦ బ్రతుకె పార్థ!

అర్జు—మా అన్నగారు చెప్పునవి మిట్టవేదాంతములే కాని మీరు రంభాది వేల్పుతొత్తులకడఁ జదువునవి యేశాస్త్రములు?

ఇంద్రు—ఏవియో తెలుగను. నీవే నుడువుము.

అర్జు—మన్మథశాస్త్రములు.

ఇంద్రు—అంగరంగవైభవములతో నుండు మా కా మన్మథశాస్త్రములు తెలియునుగాని పొట్టకూటికై పరులకొంపకు జేరు నీబోటి బ్రహ్మచారులకా గొడవలు తెలియునా?

అర్జు—మాటకు మాట తెగులు నీటికి నాచు తెగులు అన్నటుల మాటలతో నేమిప్రయోజనము? ఇంక యుద్ధమునకు గడంగెదరా?

ఇంద్రు—అర్జునా! పసివాడవు. వృద్ధి కాగలవాడవు. ఇంతకుమున్న యుద్ధము లనగా తెలియనివాడవు. ఇఁక నేనా అనేకపర్యాయములు రాక్షసులతో యుద్ధములుచేసి చేతులు కాయలుకాచి యున్న వాడను. నామాటలువిని నీపూన్కి విడువుము.

అర్జు—నీవు నీహస్తీంద్రమును విడిచిన నేను నాపూన్కి విడిచెద.

ఇంద్రు—అటులయిన నాతో యుద్ధమునకుఁ గడంగెదవా? యుద్ధమనగా నేమను కొనుచున్నావు!

అర్జు—యజ్ఞములలో హవిర్భాగములు గొనుట యనుకొనుచున్నాను.

ఇంద్రు—ఇంకెంత కాల మిట్లు హాస్యము లాడగలవు? నిన్నుఁజూచిన జాలియు నీమాటలుచూచిన జ్వాలయు కలుగుచున్నది గాన నా మాటలువిని బుద్ధిమంతుఁడవై నీ పురికరుగుము. లేకున్న తత్క్షణమే నాకరవాలముచే యమపురి కంపెదను.

అర్జు—అంతకుమున్నే మిమ్ము రంభాసంభోగమునకు పంపనా?

ఇంద్రు—నీవు పంపునదేమిటి? నిన్ను జయించి వచ్చినాడను సంతోషముతో రంభ స్వయముగానే వచ్చి తన కౌఁగిటనన్నుఁ జేర్పదా?

అర్జు—అటులకాదు.

ఇంద్రు—ఎటుల?

అర్జు—మరియొకవిధమున

ఇంద్రు—మహాగజాః పలాయంతే మశకానాంతుకా కథా అన్నటుల నీకంటె వేయిమడంగులు మిన్నలగు వారలు నన్నుఁ జెనకఁజాలక పోయిరి. ఇఁక నీవా నన్ను నిర్జించువాఁడవు?

అర్జు—శౌర్యవంతులతో యుద్ధమొనర్చి మీరు గెల్చితిరా?

ఇంద్రు—మరియెవరిని గెల్చితిని?

అర్జు—అబలులను.

ఇంద్రు—అబలులనగా బలములేనివారితోడనా? నాతో యుద్ధ మొనర్చినవారిలో బలహీనుఁ డెవఁడు?

సీ॥ ముల్లోకములు గూడ ♦ ముంచి పైవఁగఁజాలు
నముచి దుర్బలుఁడంచు ♦ నమ్మితొక్కొ
మూఁగురుమూర్తులు ♦ మూఁగినజయమందు
జంభునిసత్వంబు ♦ దంభమొక్కొ
గండక త్తైరబోలి ♦ గండరగండఁడౌ
పాకాసురుండంత ♦ లేకియొక్కొ
కయ్యంబునన్నుఁ బూ ♦ కాలుద్రివ్వగనేర్చు
వృత్రాసురుండంత ♦ వెఱ్ఱియొక్కొ
గీ॥ తక్కుదైత్యులోద్భవుల్ ♦ దర్పహీను
లొక్కొ? నీయంతశక్తిలే ♦ కున్నదొక్కొ?
మానవాధమ! వేవేగ ♦ మరలిపొమ్ము
సురలజయమంద నెందు నీ ♦ తరముగాదు.

అర్జు—అబలులనగా బలములేనివారలుగాదు నాయర్థము స్త్రీ—

ఇంద్రు—(క్రోధముతో) పంచచామరము

అరే దురాత్మ! యీ క్షణమ్మె ♦ ఆహవమ్మునందునన్
ఖరాసిచే వధింతు నీదు ♦ కంఠము న్నరాధమా
సురేంద్రుడంచు గూడ నన్ను ♦ చూడకుండ హాస్యమున్
బిరానచేయు నీదునాల్క ♦ వేయివ్రక్కలౌనురా!

అర్జు—లోకు లింతకుమున్ను మిమ్ము సహస్రాక్షుఁ డన్నట్లు నన్ను సహస్రజిహ్వుఁడందురు కాఁబోలు!

ఉత్సాహవృత్తము

మేకపోతు భీకరమున ♦ మెఱుఁగుమీర లెన్నఁడో
పోకుమీర నిల్ల చవుప ♦ చోద్యమేమియా నిఁకన్
నాకునెదుట నిలువు మమర ♦ నాయకుండవైనచో
లేకయున్న వేగఁబొమ్ము ♦ లీల రంభ కలియఁగన్.

ఇంద్రు—అర్జునా! ఇదిగో! మడిసితివి లెమ్ము.

అర్జు—భ్రమించుచుంటి రా?

ఇంద్రు—సీ॥ నా గాత్రమును బాప ♦ నాల్కలు సామక
కబళింపవచ్చు సి ♦ కాయమెల్ల

అర్జు— గరుడాస్త్ర మిట లేదె ♦ క్షణములో సర్పాసుఁ
బరిమార్చి మిమ్ము మం♦దిరముఁ జేర్ప

ఇంద్రు— మేఘాస్త్ర మును బెంచు ♦ మెయియూస విడనాడి
శ్రీహరిస్మరణమ్ము ♦ సేయుమోయి

అర్జు— పవనాస్త్ర మిదె పంపి ♦ బలగాళి మునిగి దాసుఁ
గావించి మిము రంభ ♦ కడకుఁ జేర్తు

ఇంద్రు—గీ॥ అర్జునా! రంభ రంభ యం♦టంచు నిటుల
కలవరించంగ నేల యీ ♦ క్షణమునందె
మామకీయోగ్రబ్రహ్మాస్త్ర ♦ మహిమచేత
దానిఁ జూపింపఁగలను వా♦స్తవముగాను.

అర్జు—నగవైరీ! ఎందైన వెలచేడియలు మీవంటి ముల్లోకాధిపతుల పొందుకోరునే కాని మావంటి నిరుపేదల మైత్రి కాసించునా?

ఉ॥ చూచుటకే యసహ్యమగు ♦ చర్మ దను వెల్లను చిల్లులై యధ
ర్మాచరణుండనై కపటినై గడ కొంకొక రూపధారినై
నీచపుకార్యముల్ సలుపు ♦ నిర్దయునికి సిరియున్న మాత్రనే
రోచలి కోరుకాని; మది ♦ రోయక ఏవలమున్ను కోరునే?

కాన అహల్యాప్రియా! ఇవియెల్లను తమకు స్వానుభవమ్ములే కదా!

ఇంద్రు—ఇంకనైన నీలట్టాభట్టీయము కట్టిపెట్టెదవా? లేదా? "అమ్మో పాపము వీని యాయుష్కాలపరిమితి సమీపించినదే" యని నేనెంత శాంతించుచున్నను ముందురానున్న ముప్పునకు వగవక యెంత ధైర్యముతో ప్రల్లదములు పల్కుచున్నాడవు! పాతకు బండ్లకు కాళ్లుచాచు వెర్రివానివలె నున్నాడవే! ఇంకనైన జక్కగ యోజించుకొని నీపంతము మాని కొంతకాలము ధరణిపై జీవించుము. కుంతికి గర్భశోకము గలుగనీయకుము.

అర్జు—ఆహా యేమి మీ భూతదయాపరత్వము! అయినను "అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః" అని మీవంటి ఆర్యులు వచింతురుగదా! ఇంక చింతయేల?

ఇంద్రు—అటులైన ముమ్మాటికిని నీజీవములపై నాశవదలుకొంటివా?

అర్జు—అటులననేల? పరాజయము మీదేయని సంపూర్ణధైర్యము గల నేనెప్పుడు నట్టుల తలంపను.

ఇంద్రు—అటులైన నిదిగో!

మ॥ నిరతంబున్ మునిపత్నికిన్ దితిసుతా ♦ నీకమ్ము పెన్బాము లు
ద్ధురులై సల్పగ వజ్రిభిన్నులుగ దో ♦ స్తో వార గావించి త
ద్వరమానిప్రకగంబు బ్రోచితినయో ♦ బ్రహ్మాస్త్రమా! అర్జునన్

(తెరలో: నారదుఁడు:—శాంతింపుము! శాంతింపుము! తండ్రి కుమారుల కలహమునకిదియే ప్రారంభమా?)

ఇంద్రు—(ఆలకించి ఆశ్చర్యముతో) ఆ! ఏమి!

(నారదుఁడు ప్రవేశించును.)

నార—కరుణఁ జూచుచు మహేశ్వరుఁడే మనువుమా కళ్యాణముల్గూర్చుమా.

ఇంద్రు—బ్రహ్మపుత్రా! నమస్కారము.

అర్జు—కలహభోజనా! నమస్కారము.

నార—మీరిరువురు ఇట్టి కలహము మొనర్చుట పాడిగాదు.

ఇంద్రు—అనవసరముగా నాపైకి కాలుద్రవ్విన వానికే బుద్ధిచెప్పుము.

అర్జు—ఐరావత మొసంగనిదే మాపోరాట మంత మొందదు.

నార—నేను చెప్పునది మీ రిరువురు వాలించి సంధికొడంబడవలెను.

ఇంద్రు—మీవంటి కలహభోజనులే సంధికొడంబడుమన కాదందుమా!

అర్జు—ధర్మమునకు కొడంబడని వారుందురా?

నార—(ఇంద్రునిఁ జూచుచు)

మ॥ జనకుండంచును నిన్నుఁ గోర సుతవాత్సల్యమ్ముచే నీయుఁగా
జనునీకున్; జనయిత్రి నాప్రతిముకూర్చంగాక, వైషమ్యమే
యొసనేయం సిసుఁగూర్చి, యర్జునున కాయైరావతం బాదికో
రిన కోర్కుల్ సమకూర్చుమీ ప్రతిమ పూర్తిక్ జేసిపంపించెడిన్.

ఇంద్రు—ఋషిచంద్రమా! భవదాజ్ఞ యువిలంఘనీయముగదా!

అర్జు—మునికులతిలకా! అటులనే ప్రతిసమాప్తియాటతోడనే తిరిగి పంపెదను.

ఇంద్రు—అర్జునా! నీశక్తికి సంతసించితిని.

అర్జు—వాత్సల్య విశేషమున నటుల నుడివెదరు. కాని మీయట్టి దేవతాధిపుల చెంగట నాయట్టి నరమాత్రులు ప్రశంసార్హులా?

అజ్ఞానవశమున మిమ్ముం గూర్చి పల్కిన నాప్రల్లదముల మన
మునం దిడుకొనక క్షమింపుఁడు.

ఇంద్రు—నే నాడినపల్కులఁగూడ మనమునం దుంచుకొనకుము.
మైత్రి వహింపుము.

అర్జు—మీయట్టివారి మైత్రి గడియించుకొనుట మున్గొంగు బంగా
రముకదా!

ఇంద్రు—మీ కుండు ద్వేషమూను కర్ణుని నామాయచే వంచించి
తేజోవిహీను గావించి నీకు మేలొనరించెద.

అర్జు—(జనాంతికముగా) మీ రేమియొనర్చినను యీ కలహప్రియు
నెఱుంగనీయకుఁడు. వీనికి రహస్యము కడుపులో దాగదుకదా!

ఇంద్రు—(జనాంతికముగా) అట్లను. ఈమునీంద్రుని విషయమున నట్లే
యనవచ్చును. (ప్రకాశముగా) నారదమునీంద్రా! మీకరుణా
విశేషమున మా కిరువురికి మైత్రిఘటిల్లుట మీకు కృతజ్ఞులము.

నార—నా జన్మములో పొందొనగూర్చినది యిదియొక్కటియే యన
వచ్చును.

అర్జు—అదియును మాయదృష్టమే.

నార—అర్జునా! నీవుచని మీజననియొనర్చు వ్రతనిర్వహణమున నుండు
ము. అప్రమత్తుఁడవై సంచరించుము. దేవేంద్రా! నీరాజకార్య
ములఁ జక్కబెట్టుకొనుట కేఁగుము. నే నన్యస్థానముల తీర్చు
కొనఁజనియెద. (ఇంద్రునితో) అర్జునుని మనోరథము లెల్ల సమ
కూర్చుము.

అర్జు—మునీంద్రా! ఇంకేయాజ్ఞయా? దేవేంద్రా! మీ నైరావతమే
కాక కామధేనువును, నాట్యమొనరించుటకు రంభాద్యప్సరస
లతో నరుదెంచు. వ్రతముహూర్తము ను దెలియఁ జేసెదను.

నార—జాగొనరింపక జనుము. నీ సోదరు లీయుద్ధఫలితముల కెంత
యోచించుచుందురో!

అర్జు—ఔను! అటులే! యేగెద. (నిష్క్రమించును)

ఇంద్రు—ఋషిచంద్రమా! నీవ్రతమ్మునకై యీతఁ డింతసాహసింపనేల?

నార—కౌరవులకన్న మిన్నగా నీవ్రతమొనర్చి తనజనని మనోభీష్టము దీర్చుటకే.

ఇంద్రు—అటులైన యీవిషయమున శ్రీకృష్ణుని ప్రోద్బలమేమైన నుండియుండునా?

నార—అందులకు సందేహమేమి?

ఇంద్రు—ఇతనిని నాతో కలహంబునకు బంపుటకు నేను శ్రీకృష్ణునకు నేమియపకార మొనర్చితిని?

నార—అదియెల్లను మఱియొకతూరి విన్కి యొనర్చెదను. నేను త్వరితముగ చనవలయును. (నారదుఁడు నిష్క్రమించును.)

ఇంద్రు—ఈ అర్జునుని పోరాటమున మాత్ర మీతఁడు కలహప్రేరేపణకు నొల్లకుండెను గాని అనవరత మీతనికేవో పోరాటముల కల్పించుటయే పనికదా! ఈ పోరాటమునకైన మాదేశికుండు సెలవిచ్చినట్లు అర్జునునితో ముందేమియో భూభారమును దీర్చుటకై వలయుటచేతనే పరమేశ్వరోద్దిష్టానుసారముగా నిట్లు జరిగెను. లేకున్న నీపాటికా అర్జునుఁడు భూలోకమును త్యజింపవలసినదే. ఈ కలహప్రియుఁడు చనుచు శ్రీకృష్ణునికి నాపై నేదో ద్వేషమున్నటుల చక్కగవివరింపక మనోక్లేశమును బెట్టి చనెనే! ముందిఁకేమి విపరీతములు బుట్టునో కదా! నే నీపాటికిఁ జనియెద. (నిష్క్రమించును.)








# పంచమాంకము

## ప్రథమ రంగము

(ధర్మజ, భీమ, నకుల, సహదేవుల ప్రవేశము)

ధర్మ—సోదరులారా!

ఉ॥ క్రాగెడు పాలరీతి పసి • కాయతనమ్మున అర్జునుండు "నే
నేగతి పాకశాసను జ • యించెదనో" యనునూహలేక నీ
వాగఁగఁజాల వాతని శ • రావళికంచన నాలకింపకే
సాగ రణంబుసేయుటకు • చాలెనొ! చాలగలేదొ! వానికిన్.

ఉ॥ ఆతఁడనేక యుద్ధముల • యందు సతమ్మును నారితేరి వి
ఖ్యాతివహించె నీతఁడొ గృ • హమ్మునఁ జక్కఁ జెముర్పకుండ సౌ
ఖ్యాతిశయమ్మునం బెరిగె; • నైననుద్రోణునియొద్దఁ గొన్న వి
ద్యాతిశయమ్మునన్ గురుల • యందున భక్తిని గెల్చునేమొకో.

కాని యాతని దర్శించువరకు నామనంబు తత్తరముఁ వహించును.

భీమ:—అగ్రజా! వానివిషయంబున శంకింపఁబనిలేదు. మనసోదరులలో వాని పరాక్రమమున కెవ్వరమును సరిగాము. వాని తేజస్సునకు వాని శస్త్రవిద్యానైపుణికి నోర్వలేకగాదె రాధాతనయుఁడు

మనపై వృథావైరముఁ బూని ఆ దుష్టదుర్యోధనునితోఁ గొండె ములు సెప్పి మన కొగ్గులుగావించుచుండుట. మన యర్జునునితో బోరునేని ఫాలాక్షుండైనను తన పాశుపతమ్మును నచ్చట పెట్టి నమస్కరింపఁడా!

మ॥ ప్రళయార్కుంబలె పాకశాసనుఁడు ప♦జ్వరించేసినన్ దేవతా
బలమెల్లన్ మదచంచరీకములుగా ♦ బాధింపఁగాఁజొచ్చినన్
విలసల్లీలజయించి తద్బలములన్ ♦ భేదించి యుత్సాహియై
తలపూవాడకవచ్చు నర్జునుఁడు చిం♦తేల మానుమా సోదరా!

నకు—అన్నా! మదీయదక్షిణనేత్రం బదరుచున్నయది. కానఁ దప్పక మన కొక మేలుకలుగును. అది మనవిజయుని విజయమై యుండనోపు. ఇంద్రుఁడు మనయర్జునునకు పైచేయియనియు ఆతఁడేమో కొండనుపిండిచేయుననియు భీతిల్లనేల? ఎన్ని మారు లీశుండు శక్రశిష్యులపరాక్రమమున కాగలేక రాజ్య భ్రష్టుఁడై భార్యాసుతులతో పర్వతారణ్యమ్ముల వసట జెందలేదు?

గీ॥ మేనిలోపల నూపిరి ♦ మెసలువరకు
కరముసందున ఖడ్గమ్ము ♦ కలుగువరకు
తిన్నగా మీయనుగ్రహ ♦ మున్నవరకు
నరుల కురులముగామె న♦ల్గురము మేము!

ధర్మ—సహదేవా! యీ ఇంద్రార్జునుల కలహపర్యవసానము నీ కేమని తోచుచున్నయది?

సహ—పురందరుఁడు మాచిన్నన్నగారిపైకివచ్చి రణరంగమున నిల్చె నాయనియు, నొకవేళనిల్చినను యుద్ధమొనర్చునా యనియు రొనర్చినను గెల్చునాయనియు నూహ పొడముచున్నయది.

ధర్మ—రణరంగమునకు రాక మన యర్జునునకు భీతిలి యైరావత మిచ్చి పంపు ననుకొనుట వెఱ్ఱికలంపు.

సహ——అటులకాదు. ఒకవేళ నిరువురు శత్రులునూరికొనినను మునీంద్రులు, బృహస్పతిమొదలగు పూజ్యులు వీరిని దుర మొనర్పనీయక యేదేనిసంధికావించి పంపెదరేమోయని నా తలంపు. అయినను శ్రీకృష్ణభగవానుని యనుగ్రహమున్నంత వరకు మన కేకొరంతియు రాఁజనదు.

గీ॥ నరుఁడు కొండంతయత్నమొ ♦ నర్చనేని
దైవసాయమ్ములేక వ్య♦ర్థమ్ముగాదె
నరుఁడు యత్నవిహీనుఁడై ♦ నను దలంప
దైవసాయమ్మున ఫలమొం ♦ దంగవచ్చు.

కావున మనకు తొలినుండియు యంగబలముకన్న దైవబలమే తోడ్పడుచున్నది సుమీ! అటులగాకున్న చిన్నన్నగారి కా మాయ దుర్యోధనుఁడు చేసిన యెగ్గులన్నియు బుగ్గియగునా? అందునను,

మ॥ దురహంకారముకల్గి యెట్లయిన యుం♦ద్ధుగ్ర ఘోరమైనట్టి సం
గరరంగమ్మున నిల్చి పోరఁగలకా♦కుఁగాక శ్రీమాత్రకాం
తుఁరహిఁ శ్రీపరమేశ్వరార్పణముగాఁ ♦ గావించు నీనోముకుఁ
పరమేశుండు సహాయుఁ డౌరుగొ వి♦ద్వత్పూజితా యగ్రజా.

ధర్మ——సహదేవా! నిజమును చక్కఁగ వాక్రుచ్చితివి. మనకు యాదవ వంశరత్నము అంగరక్షుగా నుండ నెల్లవిధముల విజయుల మయ్యెద మనుకొనఁజెల్లును. అయినను బలవద్విరోధము తగ దని యెంత చెప్పినను వినక చెడలినాడని మాత్రము శంకించు చుంటిని.

భీము——నేను వచ్చుట కంగీకరింపఁ డయ్యెను గాని లేకున్న,

గీ॥ ప్రథిత పారిజాతంబు నై♦రావతంబు
కల్పవృక్షమ్ము నాపైని ♦ కామగవినిఁ
దెలుపనేటికి నమరావ♦తీపురంబె
బల్మిఁగొని రానె వారణా♦వతపురికిని.

నకు—(లేచి చూచి) మీ రిటుల సంక్షుభితసాగర మధ్యస్థితనావబోలె యానందోళచిత్తులరు కానేల? దరస్మితవదనారవిందుఁడై జయకాంతాసమేతుఁడై అదిగో! చిన్నన్నగా రిట కరుదెంచుచున్నారు. సర్వమును వారిముఖముననే విని యానంద మంద వచ్చును.

(అర్జునుఁడు ప్రవేశించి ధర్మజ, భీములకు నమస్కరించి, నకుల, సహదేవుల కౌఁగిలించుకొనును)

ధర్మ—అనుఁగుసోదరా! అర్జునా! సంతోషముచే వికసితముఖారవిందుఁడవై వచ్చిన నీరాకయే మనజయమును చెప్పక చెప్పుచున్నయది. కాని నీ వావజ్రపాణితోడ సల్పిన రణరంగవిశేషములఁ దెల్పి మాకు కర్ణరసాయనమును గావింపుము.

అర్జు—సోదరులారా! నేను శ్రీకృష్ణులవారి సాయమున అమరావతీపట్టణప్రాంతమునఁ గల బయలున నిల్చి యుద్ధసన్నద్ధుఁడనైన నా రాక నాజంభారికిఁ దెలియఁ జేయించితి. అంత శక్రుఁడును సమరసన్నద్ధుఁడై వచ్చి తన్నుఁదానే స్తుతించుకొనుచు మనల నిందింపఁ దొడఁగెను.

భీమ—తనయోగ్యతకు మనల నిందింపవలసినదే.

ధర్మ—తరువాత!

అర్జు—నా నేస్తుకాఁడగు నేనును వానికిఁ దగినప్రత్యుత్తరంబు లొసఁగుచు "వృథావాక్యములతో నేమిప్రయోజనము చేతనైనయెడల దురమొనర్పుము; లేదేని ఐరావతాదిగాఁగల మత్తాంక్షితంబుల సమకూర్చు"మంటిని.

సహ—కడుచక్కఁగఁ జెప్పితివి.

భీము—

మ॥ గతవృత్తాంతము మెల్లమెల్లగ నెఱుంగంగ వచ్చు నీచేయు స
ద్వ్రతరాజమ్మున కభ్రనాగమును పోరాటమ్మునం బైన మా

నితివా! తెచ్చితివా? యెటుల్ పరిణమించెన్? క్రోధమో? మోదసం
యుతమో సల్పుము మాకు శీఘ్రముగ; లేకున్నన్ వడిం దెచ్చెదన్.

సహ—చెప్పుచుండగనే చిన్నన్నగారికి నింత యాతురతయేల?

ధర్మ—తరువాత! తరువాత!!

అర్జు—అంత నాపై క్రోధపరవశుండై తనకరవాలముచే నన్ను ఝళి పింపదొడంగెను.

భీము—తనవలె సింహోతుగాంభీర్యము గలవారనుకొనెనో యేమో?

అర్జు—అందుపై "యీ ఝళిపింపులతో నేమి పని? నీవు దేవతానాయకుండవైనచో నిలువుము" అని నా కరవాలమును గూడ జూపితిని. అంతపై తనశౌర్యము సర్వమును వమ్ముజేయుదు ననుజంకున బ్రహ్మాస్త్రమును నాపై ప్రయోగింపఁబోయెను.

ధర్మ—ఏమి! బ్రహ్మాస్త్రమునే ప్రయోగింపఁబూనెనా! అహా! వాని ఖడ్గమే గాక హృదయము కూడ సబ్రతుల్యమే. తరువాత!

అర్జు—అంత నారదమునీంద్రుఁ డరుదెంచి మీరిరువు రిటుల పోరుట తగదనియు ఐరావతంబాది మనకాంక్షితముల సమకూర్చుట కును మనకార్యానంతరమున తిరిగి యింద్రునకు మనము పంపునట్లును మాయిరువురకీ సంధియొనరించె.

సహ—కలహభోజనుఁడిటుల సంధియొనరించుట చిత్రముగనున్నదే!

భీము—అది ఇంద్రునిపైగల పక్షపాతముచే నాతనికి మేలొనగూర్చు టకు చేసిన పన్నుగడయే.

సహ—ఎటులైననేమి "సంధిమిచ్ఛన్తిసాధవః" యను వాక్యము సరణిని సంధిగావించుకొనుట సర్వజనసమ్మతమే కదా!

ధర్మ—అటులైన మనజననిగారి పవిత్రమ్మునకు మనమింక శుభదినమును నిశ్చయించుకొనఁ జెల్లునుకదా!

సహ—సందేహమేమి! అవశ్యముగా తత్కర్తవ్యము యోజించుకొననగు. అందులకై మన పురోహితుని బిలిపింపుఁడు.

ధర్మ—ఎవరక్కడ?

(సేవకుఁడు ప్రవేశించును)

సేవ—జయము, జయము! యుధిష్ఠిరమహారాజా! యేమి సెలవు?

ధర్మ—తత్క్షణము నీవుచని మాపురోహితుఁడగు ధౌమ్యునిఁ దోడ్కొని రమ్ము.

సేవ—మహాప్రసాదము. (సేవకుఁడు నిష్క్రమించును)

ధర్మ—అర్జునా! యింక మనకర్తవ్యంబేమి?

అర్జు—మనసుహృద్వంశులగు క్ష్మానేతలందరిని నాహ్వానింపవలెను.

భీము—శుభలేఖల మూలకముననా?

సహ—స్వయముగాఁజని యాహ్వానించుట యుక్తము.

ధర్మ—సరియే అటులే యొనరింతము. తొలుత శుభముహూర్త మేర్పఱుపవలయునుకదా!

(ధౌమ్యునితో సేవకుఁడు ప్రవేశించును)

(ధర్మరాజాదులు నమస్కరింతురు.)

ధౌమ్య—ధనకనకవస్తువాహనసమృద్ధిరస్తు. మనోవాంఛాఫలసిద్ధిరస్తు.

ధర్మ—గురూత్తమా! ఆ యాసన మధిష్ఠింపుఁడు.

ధౌమ్య—(కూర్చుని) నాయనా! ధర్మజా! మీతల్లిగారికిని సోదరులందరికిని సేమమేనా?

ధర్మ—భవదీయాశీస్సువలన నేటివరకందరికిని శుభమే.

ధౌమ్య—"ధర్మమేవ జయతి" అనునట్లు ధర్మమెక్కడనుండునో అక్కడ జయమును శుభమునుగల్గుట కాటంకి మేముండును?

బిడ్డలారా! మీ పెదతండ్రిగారి శుభోదంతము తెలియంగవచ్చుచుండెనా?

ధర్మ—చారులవలన తఱచుగ నాలించుచునే యున్నారము.

ధౌమ్య—వారెల్లరు నిర్విచారులై సౌఖ్యమ్మున యలరారుచుండిరా?

భీము—మా విషయమును గూర్చి తప్ప—

ధర్మ—అటులనే.

భీము—గురూత్తమా! అనతికాలముక్రిందట మా పెదతల్లిగారగు గాంధారీదేవిగారు వైరావతవ్రత మొనర్చినారుకదా!

ధౌమ్య—మీ కేమి రాజాధిరాజులు! ఎన్నివ్రతములనైన చేయఁగలరు. అవును. ఆలించితిని. చాలచక్కఁగ చేసినారట! వెళ్లినవారెల్లరు పరమేష్ఠికైనను వర్ణింప నలవికాదనుకొనిరి.

ధర్మ—మహాత్మా! తమరేల జనకుంటిరి?

ధౌమ్య—తమరు వెడలిన నేనును వెడలియుందును.

భీము—అంతవైభవముగఁ జేయుచున్నను పిల్లకి పిల్లే, పల్లెకు పల్లేయను నటుల మాశక్తికొలఁది మాతల్లిగారిచేకూడ తద్వ్రతము చేయింప దలఁచితిమి.

ధౌమ్య—దేవాంశ సంభూతులరగు తమరేదిదలఁచినను కొనసాగకుండునా?

ధర్మ—విబుధవర్యా! తద్వ్రతమ్మునకు సుముహూర్తము నించుడు.

ధౌమ్య—(సులోచనములు లోచనముల కలంకరించి పంచాంగమును చూచి వేళ్లు లెక్కించుకొని) చైత్రశుద్ధ త్రయోదశీభృగు వాసరము శుభప్రదముగా నున్నదిగాన తప్పక యానాడే యావ్రత మొనర్పఁదగి యున్నది.

అర్జు—అన్నదమ్ములారా! మన గురువులవారి యాజ్ఞానుసార మొనర్పఁదగి యున్నదికదా!

భీము—అవశ్యకర్తవ్యము.

ధౌమ్య—పురమున మఱికొన్ని శుభకార్యములుగలవు. సెలవుగైకొని యెద. నాయం దనుగ్రహ ముంచవలెను. మీచిత్తము నా భాగ్యము.

నకు—మీర లీవ్రతమానకు సుకాల్యణికి నుండవలెను.

ధౌమ్య—నాయనలారా! మీరందరు సుగుణసంపత్తిగలవారు గనుక నన్నట్లనెదరు. తమ యాశ్రితునియందు యింత ప్రేమాతిశయము జూపువార లింకొకరుగలరా?

సహ—స్వామీ! యీకార్యమును తమకార్యముగా గణించి శ్రద్ధబూనెదరుగాక!

ధౌమ్య—బిడ్డలారా! యికజాగొనర్పక వెడలెద.

ధర్మ—వెళ్ళుడు. అనుగ్రహ ముంచవలెను.

భీము—సేవకా! వారిని జాగ్రతగా పంపిరమ్ము.

(ధౌమ్యుడు సేవకుడు నిష్క్రమింతురు.)

ధర్మ—ఇక్కడికి సుముహూర్తము నిర్ణయమైనది.

అర్జు—అగ్రజా! ఎక్కడికెక్కడి కెవ్వరు వెడలవలెనో సెలవిండు.

ధర్మ—మనభీముడు సాళ్వుని, నీవు మన దేవకీవసుదేవులను, బలరామకృష్ణాదులను, కవలు సమస్త రాజులను పిలువదగును. నేను హస్తినాపురమేగి ధృతరాష్ట్ర భీష్మ ద్రోణాది కురువీరుల పిల్చివచ్చెద.

సహ—సోమదత్తశల్యుల కొఱకెవ్వరేగెదరు?

ధర్మ—మనభీముం డేగు మార్గమధ్యమగుట వాని కనుకూలముగా నుండును.

భీము—గాంధారి మొదలగు స్త్రీజనంబుల నెవరుపిల్తురు?

ధర్మ—మనజననిగారే వెళ్ళఁదగును.

నకు—అవును, యీవ్రతమునకు ముఖ్యకారకురాలగు గాంధారీదేవి గారిని తప్పక రావించవలసినది.

సహ—ఈర్ష్యచే జేయించుచుంటిమని అమెవచ్చునను విశ్వాసములేదు.

అర్జు—జననిగారుకూడ వెళ్లిన యిచ్చట కార్యములు నిర్వర్తించు వారెవ్వరు?

ధర్మ—తగుమనుష్యుల నియోగింతము.

భీము—మనము ఇంద్రుని జయించి దేవతాకరినిఁదోడ్తెచ్చి యింత వైభవముగ జేయువ్రతమును దుష్టచతుష్టయము వచ్చి వీక్షింప వారికి కన్నుగుట్టదా?

నకు—కర్ణాదులకు యీవార్తవినినంతనే నిజముగ గుండెచెరువుకాదా!

ధర్మ—బాల్యప్రభృతి దుష్టులగువారిజోలి మనకేల? మనము మాత్రము "కార్యార్థినః కుతోగర్వః" అను నార్యోక్తిప్రకార మంచటికిఁ జని వారిని వినయవిధేయతగ పిల్చిరావలెను. ఇఁక జాగుచేయుక మీ మీ కార్యముల నెరవేర్చుకరండు. నేనును వెళ్లివచ్చెద.

సహ—అగ్రజా! ఒక్క విషయము మఱచితిమి.

ధర్మ—దానిని నుడువుము.

సహ—ఐరావతగజమ్మును రక్తోత్పలమ్ముల పూజించవలయు నని వ్యాసభగవానులవారి యాజ్ఞ

నకు—వానిని దుర్యోధనుం డెందునుండి సంగ్రహించెనో!

భీము—(హాస్యముగా) ఐరావతగజమును గ్రహించిన స్థలముననే.

ధర్మ—అవి యెక్కడ యెట్లు లభించునో?

అర్జు—ఆయ్యవి విభీషణపరిపాలనంబులోఁ గల లంకలోఁ గల వని కర్ణాకర్ణికగా విని యుంటిని.

ధర్మ—అటులైనచో లంకాపురంబునుండి మనకు నవి వచ్చు నుపాయము యోజింపుము.

అర్జు—అతఁడు మనకోరిక నిరాకరించునో అంగీకరించునో?

ధర్మ—త్రేతాయుగంబున సీతాపహారియగు తన అగ్రజుని దుశ్చేష్టితంబుల కోర్వక తమకు శత్రువైన శ్రీరామచంద్రుని కుపకృతిసల్పి ఆమహానుభావునిచే శ్రేయములందిన ధర్మమూర్తి మన కీమాత్రము సాయముచేయుట కంగీకరింపఁడా? తియ్యని నోరు చేదుమేయునా?

భీము—అతఁడు రాజద్రోహియనిమాత్ర మొకలోకాపవాదము కలదు.

నకు—అవును. ఆపలుకు ధ్రువమే. అతఁడు శ్రీరామచంద్రుని పజ్జకుఁ జేరి వానిరహస్యములెల్ల వెల్లడించనిచో రావణుఁడు యక్ష కిన్నరగంధర్వాసురాదులకు నజేయుఁడుగదా! ఆరీతి పరమేష్ఠిచే వరము లందెనుకదా!

సహ—అందులకే కాఁబోలు! ఇంటిగుట్టు లంకకు చేటని యందురు.

అర్జు—కరుణగలవానిని భీరువనియు, ధైర్యవంతుని కరుణావిహీనుఁడనియు, యథార్థవాదిని పక్షపాతియనియు, త్యాగిని దుర్వ్యయము నొనర్చువాఁడనియు నిటులే లోకం బెట్టివారికి నేదే లోపంబు నెన్నుచుండును. కాని అంతమాత్రమున అట్టి మహాత్ములకు కొఱఁత కల్గునా?

నకు—షోడశకలాపరిపూర్ణుఁడగు హిమాంశునకు కళంకమున్నను చంద్రికావ్యాప్తిని కొఱఁతయుండనటులే వాని విషయమునను నగును.

ధర్మ—మన కీ యప్రస్తుత మేల? కార్యసాధనమునకు యత్నింపుఁడు.

అర్జు—నేను వానినెట్టులేని తెప్పించెదను. ఇఁక నూరకు సెలవా!

ధర్మ—సోదరులారా!

గీ॥ నిద్ర నాహార మెడద గణింపరాదు
విమలభావంబు శాంతంబు ♦ విడువరాదు
బడలిక ఘటిల్ల దానికై ♦ యడలరాదు
కార్యసాధనకై పూనఁ ♦ గల నరుండు.

ఇఁక చనుడు. నేనుఁగూడ వెళ్ళివచ్చెద. (అందరు నిష్క్రమింతురు.)

---

ద్వితీయరంగము.

(ధృతరాష్ట్ర, దుర్యోధన, భీష్మ, విదురులు ప్రవేశింతురు.)

ధృత—అమరనదీనందనా! మన పాండవుల కుశలవార్త లరయుచుంటివా?

భీష్మ—సర్వదా వారిక్షేమము నరయుచుంటిమి.

విదు—దేవా! వారిశుభములు మన మరయకున్నను లోకరక్షా నిపుణుఁడు వారియందు నిర్వ్యాజకటాక్షవీక్షణములఁ బరపుచునే యుండును.

చ॥ వనమున వృక్షసంతతికి నీ♦వందు జలంబిడి ప్రోచుచుండెఁ; గా
తని నివసింపు తప్పనెలి♦తిగ గనకుండఁగనోము నెప్పుఁడా
వనజదళాక్షుఁ డెల్లరకుఁ ♦ బారకృపన్ మునజేయుగాదె సీ
తనయుల పాండవేయుల స♦తమ్ము సుఖస్థితులై వెలుంగగన్॥

దుర్యో—(తనలో) యీవిదురుఁ డెప్పుడును పాండవుల వందిమాగధకోటిలో చేరినవాఁడు. వారెప్పుడో తనకు కనకాభిషేకము చేయుదురని పేనియాశ.

ధృత—విదురా! వారిప్రశంస నేనెప్పుడొనరించినను వాడికరమ్ముల కన్నమిన్నగ నాహృదయంబు నొవ్వగ నలుగురు నవ్వగ పలికెదవేల? అన్ని విధముల నశక్తుఁడ నేనేమిచేయఁగలను?

చ॥ సుతు లుదయించి వంశమును ♦ శోభిలఁజేయుదురందు కొందఱుం
సుతు లుదయించి సౌఖ్యములు ♦ చూపఁగనందఱువారు కొందఱుం
సుతు లుదయింప స్వర్గమును ♦ చూపఁ గలంగనుటందు కొందఱుం
సుతులకు వాదిపోయెనరు ♦ సూ! యిటు ముప్పునెఱుంగ కే జనుల్.

మ॥ జనవంబోతరి మాతృగడ మటుపై ♦ సర్వాంగనత్స్నేహవం
బును కాఱుపడిన చింత; దూపయున దు♦ర్బుద్ధిఁ విడఁబించు చో
ఘనసూపావంత; సుశోవిహీనుఁడగు చుం ♦ గాల్పంగ తత్ఖేదమొం
తనివర్ణింపఁకలాడ! మీరెయగు గాం♦దా శత్రుపుల్ ధారుణిన్.

దుర్యో—జనతా! వారినే రావించి సర్వంసహాచక్రమ్మునకు పట్టాభిషిక్తులంగావించి సీరియుందరియుం గ్రహమ్మునకు గుటికాక యును గ్రహమ్మును గడించుకొనరాదా? యేపున్నెము పాపమెఱుంగని మ మిమ్మారీతి దూఱనేల?

విదు—(తనలో) వారికి పట్టాభిషేక మొనరింపకున్నను యీదుష్ట దుర్యోధనుని గర్వమ్ము నమ్మగా యీపేరోలగమ్మున వీనికి వంచనయగునట్లు పల్కుటయే చాలును. (ప్రకాశముగా) ఓ దుర్యోధనా! ఏమి నీ శ్రీరంగనీతులు! నాలికతీపుపల్కులు! వానినిగుఱించి యేపున్నెము పాపమెఱుంగవా? నే నుడువవలయునా? నీమనస్సాక్షి నీకు బోధించుటలేదా? పాపమంత యుమాయికుఁడవు! వేయేల! నీతప్పుట్టును లంకకుచేటన్నటుల వారిపై నీకు ద్వేషము గల్గుట వినాశమునకే యగుఁజుమీ!

దుర్యో—

ఉ॥ ఎందుల కేండ్లు వచ్చి శత ♦ వృద్ధులరైన ఫలంబదేమి మే
మందఱికంటె నీతులు స♦మగ్రముగా గ్రహియించినారి మం
దుం దలపోతగాక సిరిఁ ♦ జూచిన యోర్వమిమాయగాక మీ
కుం దగవౌనె యిట్లు పసి♦కుఱ్ఱలనమ్ముల దూఱనాడుటల్.

భీష్మ—ఎందులకీ యుపస్తుత వాగ్వాదము? సంచిత వాసనాకర్మమునుం బట్టి జీవకోటికి సుఖదుఃఖములు, భాగ్యదరిద్రములు గల్గుచుండును. కాన యొకరినిఁగూర్చి మనము చింతవహించుట గాని సంతసమందుట కాని తగదు. అవి వారలసుకృత దుష్కృత పరిపాకవిశేషమ్ములు. అనతికాలముక్రింద మన గాంధారీదేవి యొనర్చిన గజలక్ష్మీవ్రతమ్మునకు కుంతీదేవిని, యామె సుతులను గౌరవపురస్సరముగా నాహ్వానించక యుండుటచే మనమున ఖిన్నతవహించి పాండవమధ్యముని కెఱింగించెనట! అంతె నతం డాగ్రహోదాత్తచిత్తుఁడై తనతల్లిచే యావ్రతంబు నిజమైనయైరావతంబుచేఁ జేయించెదనని యామెమునసునఁ కూఱట కలుగునట్లు ప్రతిజ్ఞఁ బూనెనట!

ధృత—ఏమీ చాలవింతగ నున్నదే! మనమటుల పిలువకుండుట గొప్ప తప్పిదమని యొప్పుకొనక తప్పదు. తరువాత?

విదు—తప్పని యిప్పటికైనను తమకు గోచరమైనదా?

ధృత—విదురా! అమరనదీనందనుఁడు నుడువునది తుదముట్ట విననిమ్ము.

భీష్మ—తరువాత యుధిష్ఠిరాదిసోదరులు మన మిందుని జయించి యభ్రమాతంగమును గైకొనఁ గలమా యని శంకించి యెట్టకేలకు ధైర్యమూని శ్రీకృష్ణుసహాయమున ఆ మఘవుని కడ కొకరాయబారి నంపిరట!

ధృత—ఎట్టెటూ! చాలవరకు జరిగినదే.

భీష్మ—అంతట యావార్తవిని జంభారి యుదగ్రుఁడై విజృంభించి 'యొకనరమాత్రునకే జడిసి నాదంతావళము పంపించెదనా? శక్తిఁగలిగినచో సమరమునకు రమ్మ'నెనట!

ధృత—భళీ! నా నమూరోద్భవుండ డైనను కిరుణించి తన ద్విపరాజముసు సంపుట కిచ్చగింపలేదాయెనా? అతఁ డాగ్రహించిన కూడ వీరు తమపూన్కి విడువలేదా?

దుర్యో—వజ్రాయుధపురుచి-చూడక వారు తమ పూన్కి విడతురా? "అత్యుచ్ఛ్రాయః పతనహేతు" వనినట్లు మేమే జగదేక వీరుల మని విఱ్ఱవీగుట యూసురరాజు యొద్దనుసాగునా? తుదకు శృంగ భంగము కాకుండెనా?

విదు—ఇంతలో తొందరయేల? సర్వము సావధానమతి నాలకింపరాదా?

దుర్యో—ఇంక నాలింపనేల? అగ్నిహోత్రునిపై కేగు శలభంబు గతియే మన గాండీవిగతి.

భీష్మ—అంత కాపట్టిన కుందేటికి మూడే కాళ్ళని తనపట్టువిడువక మన యర్జునుండతనితో దురమొనర్చెనట! ఆపోరుఘోరమైయొప్ప బ్రహ్మమానసపుత్రుఁడగు నారదఋషీంద్రుఁ డీయిరువురను సమాధానమొనర్చి మనయర్జునుని కోర్కె సాగింపఁ జేసెనట! కొలఁదిదినములలో నైరావతవ్రతము తనతల్లియగు కుంతీ దేవిచే చేయింపనున్నాడట!

ధృత—ఆహా! వీరి ధైర్యసాహసములు! దైవసాహాయ్యము లద్భుతముగ నున్నవే! వచ్చినను తాదృశసుతోదయమ్మననే సద్యశము రావలయును. గంపెడుగులకరాళ్ళేల ఒక్క యింద్రనీలమణి యున్న చాలదా?

దుర్యో—అవును. ఆ బ్రహ్మర్షి యడ్డుపడకున్నచో మనపాండవమధ్య ముని గతియేమయ్యెడిదో! పసివాఁడని యాముని చంద్రుఁడు కరు ణించెను కాఁబోలు!

విదు—పసివాడనికరుణించెనో ఇంద్రునిపనమాన్యునని యూహించెనో?

(భృత్యుఁడు ప్రవేశము.)

భృత్య—ధృతరాష్ట్ర మహారాజా! యుధిష్ఠిర మహారాజువచ్చి తన రాక తెల్పుమనిరి.

ధృత—వేగిరమే లోనికి ప్రవేశింపఁ జేయుము.

(ధర్మరాజు ప్రవేశించి ధృతరాష్ట్ర భీష్మ విదురలకు నమస్కరించును.)

ధృత—నాయనా! ధర్మనందనా! మీరెల్లరును శుభస్థితినుంటిరా?

ధర్మ—మీరు కంటికి రెప్పవలె నిరతి మదోనఁగులు పొనఁగనియాటుల కాపాడుచుండ మా కొక లోపముండునా?

ధృత—మనభీష్ములవా రిప్పుడే తా మొక చారునివలన విని మనయర్జుని పరాక్రమ విశేషమ్ముల ప్రశంసించుచుండగ నాలకించి యామందానందభరితులమైతిమి.

ధర్మ—మనుమలపైగల ప్రేమాతిశయమ్మున వారటులమమ్ము ప్రశంసించుచుందురుగాని దుష్టుల సంహరించుటకై శ్రీమన్నారాయణాంశచే జనించిన పరశురాముని జయించిన వారికి బాలుఁడగు మనయర్జునిని పరాక్రమములు గణింపదగినవా?

భీష్మ—బాలప్రాయులరగు తరుణముననే యింద్రాదుల జయించు మీరు వయోగరిమము వహించుదురేని,

ఉ॥ భూనుతకీర్తిచే నెగడి ♦ పూజ్యులరై పనివచ్చెనేని యా
స్థాణునినైన గెల్చుటకు ♦ జాలి సమస్తధరాపతులెప్డు మీ
యానతినాళిఁ దాల్పఁగ మ♦హావిభవమ్ము వహించి రామభూ
జానివిధమ్ము రాజ్యము వె♦సం బరిపాలన సేయుకుందురే?

విదు—శాంతనవునిపల్కు లమోఘములు.

ధృత—(తనలో) వీరిపై వీఁకింత యవ్యాజానురాగముగల్గుటకు వీరి ధర్మవర్తనమేకదా కారణము! (ప్రకాశము) వారి పల్కులు యథార్థము.

ధర్మ—అఖిలైకధర్మములకు తామరతంపరలై చెలంగు భవాదృశుల యాశీస్సులు మా కవిచ్ఛిన్నశుభదాయకములుకదా!

దుర్యో—(తనలో) శ్రీరామచంద్రునివలె వీరు రాజ్యమునప్పగిన్నను యుదుములందుటలో తుల్యులయ్యెదరేమో!

ధర్మ—పరమపావన చరిత్రులగు మహాత్ములారా! మీయందరి కృపా
విశేషమున మాజననిగారిచే గజలక్ష్మీవ్రతము నొనర్పింపఁదలఁచి
తిమి. కాన మాకు సర్వవిధముల పెట్టనికోటలును పట్టుకొమ్మ
లరగు మీరరుదెంచి తద్వ్రతపూర్తి యొనర్పవేడుచున్నాడను.

ధృత—బిడ్డా! మా కింతకుమించిన ముదావహ మింకేమికలదు!

చ॥ కొడుకులు యోగ్యులై విబుధకోటినుతింపఁగ మాతృకాంక్షలిం
పడరఁగఁదీర్చుచో ప్రియద మందుచు వచ్చుటమాననేల? యి
క్కడ మిమునుంచకుండ నొడిగట్టితి నెంతయు లోకనింద; ని
ప్పుడు మరిరాకయుంటతగవో జనులెల్లరు బుద్ధిదిట్టరో!

ధర్మ—జనకా! మమ్మిందు నుంచమైతిమనుకొఱంత రవంతయు వలదు.
అచ్చోటను మీకరుణావిశేషముననేకదా సుఖులమై యుండుట!
మాతండ్రి లోకాంతరగతుండౌటయాది పిన్నలను పెద్దలుగ
సాకి తగినదేశికోత్తములచే సత్కళావిశారదులఁ గావించి సోదర
తనయులనియు నాత్మతనయులనియు భేదమొక్కింతయేని భావిం
పక మాక్షేమము యోజించియే నందు నివసింపఁజేసితిరికదా!

విదు—

ఉ॥ ఇచ్చటెయుంచి త్రివ్రతలకై కెత్తక నిందనుపొందితంచు పై
పెచ్చుగ బల్కెదో! చిదిమిపెట్టినబిడ్డలయి మొల్లవారిక
మ్మచ్చున తీయఁగాఁగల బలాఢ్యులు వారలకేమి లోటగుఁ
ఇచ్చకముల్ వినంగను సహింపదు నామన మెప్పు డగ్రజా!

ధృత—విదురా! నాహృదయమెఱుఁగక నిరత మిటులనే పల్కుచుం
దువుకదా!

భీష్మ—విదురా! సర్వజ్ఞుఁడవగు నీ కీవృథాప్రసంగమేల?

ధర్మ—(దుర్యోధనుని జూచి) సోదరులారా! ఈ రాజసూయమునకుఁ గా
ర్యనిర్వాహణమునందు నాకు సహాయభుజములై గ్రాలవలయును.

దుర్యో—అగ్రజా!

చ॥ అనితరసాధ్యమై సురల ♦ కైనను లభ్యముకాని సద్వ్రతం
బును విధినక్రమంబుగ ప్ర ♦ మోదమతిం దమరాచరింప మా
కనులకుపండువై దనర♦గా తిలకింపగ మాకుఁ జెల్లదో
అనిమిషభామినుల్ చెలువ♦మై యరుదెంచియు నాట్యమాడఁగన్.

ధర్మ—అనుజా! దీనికై నీ వచ్చెరువందపనిలేదు. మీ మొనర్పనున్న దానికన్న వేయి మడుంగులు మిన్నగా దానధర్మములొనర్చి మా పెదతల్లివ్రతమును నెఱవేర్చితివి.

దుర్యో—ఎన్నిదానము లొనర్చినను మీవలె నైరావతకరిని సంగ్రహింపఁ జాలమైతిమిక దా!

భీష్మ—భక్తిప్రధానమె కాని యలంకారములతో నేమి ప్రయోజనము?

ధర్మ—ఆర్యులారా!సోదరులారా! నేనిఁక నేగి ద్రోణాచార్యాది దేశికోత్తములను తక్కుంగల బంధుసముదాయమ్మును నాహ్వానించి సత్వరమ్ముగ తత్కార్యసాధనము లొనర్చుచుండవలయు. ఈ వ్రతశుభదినమీ చైత్రశుద్ధత్రయోదశి యగుటం జేసి నాటికి పూర్వదినముననే యరుదెంచుఁడు.

ధృత—పుత్రా! మా రాకల విషయమై సందియమందకుము. నీవిఁక సత్వరంబునఁ జనుము.

ధర్మ—సర్వదా మాయభ్యుదయపరంపరల నాసించు భీష్మ, విదుర మహాశయులారా! మీకు వేయునుడువనేల యని తప్పక విచ్చేయుదురని యువ్విళులూరుచు వెడలుచున్నాడను.

భీష్మ—శుభమగుగాక! (ధర్మజుఁడు నిష్క్రమించును.)

విదు—దేవవ్రతా! వీరిసౌశీల్యము వీరిధర్మాధర్మవిజ్ఞానము యార్యుల పై

గల నమ్రత, దీనులపైగల నిర్వ్యాజ కటాక్షవీక్షణములవలననే వీ రెట్టి దుర్ఘటకార్యము తలపెట్టినను సఫలీకృతమగుచున్నది.

భీష్మ—అందుకు సందేహమేమి! సుగుణపుంజము వారికుగ్గుపాల నుండియే యలవడియున్నది.

ధృత—(తనలో) వీరికియుభ్రుకిని నాసుతులపై యసూయయు వారిపై యభిమానముగాన వారిని స్తుతింపుచు చెవికిచేదగు పల్కులు వీరుపల్కుచుండ వినఁజాల. (ప్రకాశముగ) అమరనదీనందనా! నేఁటికి కొలువు చాలింతమా!

భీష్మ—గాంధారీదేవిని తక్కుంగల స్త్రీజనంబును నాహ్వానించుటకు కుంతీదేవి యరుదెంచవచ్చును. దుర్యోధనా! వారికిఁ దగిన సౌకర్యములొనర్చి వా రొక వేళ యేమేని గోరిన, వాని నెల్ల నొసఁగుము. మీ రుభయు లన్యోన్యస్నేహమున మెలఁగుచుండుటయే మాకు సంతోషావహము.

(అందఱు నిష్క్రమింతురు.)

---

## తృతీయరంగము.

గాంధారి మందిరము: కుంతిదేవి ప్రవేశించును.

కుంతి—ఆహా! షోడశకళాపరిపూర్ణుఁడగు శుభ్రాంశువకును కళంక మున్నటుల నెంతమంచివారికిని కొంచెమైన కళంకముంచక యా విధాత సృజింపడుకదా! యటులకాదేని పతివ్రతామణు లలోనగ్రగణ్యయని పేరొందినమాయక్కయగుగాంధారీదేవికి

నాపై యీపగిది యసూయజనించునా? ఇదియును నొక మేలే యనవచ్చును. ఏలన, సూర్యకాంతశిలపై సూర్యుని పాదములోకి ప్రజ్వరిలుమాడ్కి ఆయమ యసూయయె నాకు నద్యశమందుటకు మూలకారణమగుచున్నది. నేను దైవయోగమున నిట్లనాథనగుటంజేసి నన్నుగణింపక చులకఁజేసినది. తన యైశ్వర్యముచూచికొని యోగ్యాయోగ్యమెఱుంగక విల్లమ్ములుకలవారికి చల్లకడవలు కలవారు తోడాయని యూహించి గర్వించెను. ఆహా! యిల్లలికినంతనే పండువగునని దలంపరాదు కదా! ఆపరమేశ్వరుని కరుణావిశేషమున నాయైదుగురు సుతులు చిరంజీవులయినేని కష్టములు పీటలుపెట్టుకొని కూర్చుండునా? నాకష్టము లింకనైన తొలఁగిపోవచ్చునని తలంచెద. నన్ను తనవ్రతమునకుఁ బిలువని యీర్ష్యాళువు నావ్రతము వీక్షింప చనుదెంచునా? అయినను అపకృతిసల్పిన వారి కుపకృతిసల్పుటయేగదా నేర్పరితనము! నే నిటుల నిజమైన యైరావతముతో వ్రతముచేయుట నాలకించి తనపైపంతమునఁ జేయుచుంటినని తానెంత యాగ్రహించునోకదా! క్రోధావేశపరవశులగు వారిమనము జలతైలబిందున్యాయమున సర్వము మలినయుతమై యుండునుకదా! అయినను తానెంత రాజాధిరాజునకర్ధాంగియైనను నేనును ఆమెకేరాలునగుటంజేసి నాకామెపల్కులు లక్ష్యమేమి? ఇప్పుడే యీమె మందిరమ్మునకుఁ జేరితిని. ఇంక నేనరుదెంచినటుల కబురంపెద. ఎవరక్కడ?

(దాసి ప్రవేశించును.)

దాసి—(తనలో) ఎవరో క్రొత్తమ్మవారుగ నున్నారు. ఎవరమ్మా మీరు? ఏమి పని?

కుంతి—మీరాణిగారగు గాంధారీదేవితోడ మాతోడికోడలగు కుంతి మిము దర్శించుట కరుదెంచెనని చెప్పి తోడ్కొనిరమ్ము.

(దాసినిష్క్రమించును.)

(గాంధారి ప్రవేశించును.)

గాంధా—చెల్లెలా! నీవును నీసుతులును క్షేమమే కదా?

కుంతి—మీయందటి కరుణావిశేషమున నేఁటిదనుక కుశలముగనె యున్నారము.

గాంధా—అమ్మాయీ! నే నొనరించు వ్రతమునకు వచ్చిపిల్చుటకు సావకాశము లేమి నీసుతుఁడగు సుయోధనునిచే వర్తమాన మంపఁగ రావైతివి కదా! మనలో మన కింతభేదమా? నీ వరు దెంచక నా కెంతయో మనోక్లేశమును సంఘటిల్లఁ జేసితివి కదా! అది నీకు ధర్మముగఁ దోఁచెనా?

కుంతి—అక్కా! యీ స్వల్పవిషయమున కనృతము లాడవలెనా? మృషావచోవిహారివై సద్గతులకు దూరము కానేల? బావగారు పుట్టంధులు, నీవు రాజ్యగర్వాంధవు. అట్టిచో మీయుభలకు మాబోఁటివారు కన్పింతురా?

గాంధా—అటులాడినచో నేనేమి పల్కఁగలను?

కుంతి—నీవు సుర్యోధనునికి నుడివియుందువే మో కాని నాకు నీవ్రతమును గూర్చి రవ్వంతయు నాతఁడు తెలుపఁడయ్యె. అక్కా! అయినను,

సీ॥ ధర్మజు నెల్లని ♦ దరిఁజేర్పకు మటంచు
చెవినిల్లుకట్టుక ♦ చెప్పువారు
పవనజు నెల్లని ♦ పరిభవించు మటంచు
ప్రొద్దెల్ల గుజగుజల్ ♦ వోవువారు
అర్జును నెల్లని ♦ నిర్జింపవలెనంచు
ముల్లమాటలునూరి ♦ పోయువారు
కవల నేలనుబెట్టి ♦ కాలరాయుమటంచు
వ్యర్థులై తలపట్లు ♦ పట్టువారు
గీ॥ సంగడీండ్రుగ నుండ నెబ్బంగిఁ బిలువ
వచ్చు? తనబుద్ధి పెడతలఁ ♦ బట్ట కుంచు

ఎట్లు? చుట్టాలసురభి పేరెల్లఁగాంచు?
యుత్తముండగునట్టి దుర్యోధనుండు.

గాంధా—ఆహా యేమి నీ అసంబద్ధ వాగ్ధోరణి! నిష్కారణముగా నాతనయుఁడగు సుయోధనుని, వాని సుహృద్వర్గమ్మును నేల దూషించెదవు?

కుంతి—వానికి కొండెములు బోధించి మమ్ము ముప్పతిప్పలు బెట్టువారు వేలుగనుండ నీపుత్త్రు నే నేల దూషింతును?

గాంధా—కాకదంతపరీక్షవలె యీ నీ నిష్ఠూరవు వాక్యప్రసంగము వ్యర్థముకదా!

కుంతి—సోదరీ! మత్ప్రసంగము వ్యర్థముగను, నీమనసునకు బాధాకరముగనున్న మానెదను లెమ్ము. కాని నాయీం దంతఃకరణము వహించి నావచ్చినవిశేష మెఱుంగుము. అదేమన, ఐరావతవ్రతమనుపుణ్యవ్రతంబును మీరు సమస్తవైభవములతో నొనర్చి భూసురోత్తముల గోభూహిరణ్యాదానములదనిపితిరని విని నే నమందానందమ్మును వహించి నేనును నాశక్తికొలఁది తద్వ్రత మనుష్ఠించదలఁచి యర్జునునకుఁదెల్ప సంతసించి తత్కార్యనిర్వాహణమునకుం గడంగె. అయ్యది రానున్న భృగువాసరమె యగుట నాకుసాయమై తద్వ్రతనిర్వాహణమొనర్తువని కొండంతయాసతో నిన్నాహ్వానించుటకై యరుదెంచితి. కాన సోదరీవాత్సల్యమ్మున నేఁడే నాతోడ తప్పకవిచ్చేయుము.

గాంధా—(ఆశ్చర్యముగా) ఎట్టెటూ! నీ వీవ్రతమొనర్ప నుంటివా? అద్దానికై యర్జునుఁడేమేమిసమకూర్చె? సర్వము వచించి నాకు శ్రోత్రపేయ మొనర్చుము.

కుంతి—నేఁటిదనుక సమకూర్చిన దేమియు లేదు. పురందరుఁడు వ్రతమున కైరావతగజంబును మఱియు కావలసినచో రంభాద్యప్సరసలను బంపెదనని పల్కెనట!

గాంధా—(అసూయతో) చెల్లెలా! అటులనుడువుము. శచీదేవికన్న మిన్నగ నీ వివ్రతమును సకలవైభవములతో నొనర్చి నాకు పరాభవ మొనర్ప నుంటివా?

కుంతి—సోదరీ! నేను దేవతాగజేంద్రముతోడ వైభవముగ వ్రత మొనర్చుట నీకు పరాభవకారణమా! ఇదివింతగనున్నదే!

గాంధా—అందుకు సందేహమా?

కం॥ నాకొడుకులు శూరులునా
నీకుఁ గనర్వమ్మొకింత ♦ నిజముగఁ గలిగెన్
లేకున్నను నీ వివ్రత
సాకల్యమొనర్పఁ దలఁపఁ ♦ జాలెదవాక్కా.

కుంతి—అక్కా! ములుకులంబోలు నీపలుకులు కే నులుకవలసినదే కాని ప్రత్యుత్తరం బీయ నసమర్థను. నీవెప్పుడు పయనమయ్యెదవో నుడువుము. తక్కుంగల మనసోదరీమణులనుకూడ పిల్చివచ్చెదను.

గాంధా—నాఁడు విన్నుఁబిలుచుటలో మాసుయోధనుఁడు కార్యనిమగ్నుఁడై మఱచుటచే నాపై పంతమూనిచేయు నీ యీవ్రతమునకు నేను రానొల్లను.

కుంతి—నేను రానొల్లనని పల్కిన నమ్మతముగుగాని పంతమునుబూని యొనర్చుచుంటివని నాపై వృథానింద మోపకుము.

గాంధా—సోదరీ!

ఉ॥ ముక్కుమొగమ్ముచూడకయె ♦ మూర్ఖులఁగూడి భవత్సుతుండు మ
మ్మిక్కటులందజేసెనని ♦ యీవెవచించుచు నింకనిందఁబెం
పెక్కఁగ మోపుచుంటివని ♦ పేర్లుదె? నాసుతులన్నచో నయిం
బ్రిక్కపడంగనెందిరె భవత్సుతులయ్యది నీ వెఱుఁగవే!

కుంతి—అక్కా! మనలో మనకు వాగ్వాదమేల? నీ నాసుతులదుండగములు లోకమెఱుంగకపోలేదు. కాగల విధానములు జరుగకపోవు. కాని నాయం దనురాగముంచి నాకోర్కె మన్నించి వ్రతమును దిలకింపరమ్ము. నే నింక వెళ్లివచ్చెదను.

(కుంతి నిష్క్రమించును.)

గాంధా—అహా! యేమి యీమెగర్వము మేరమీఱియున్నదే! నేనును వెడలెదను. (నిష్క్ర)



శ్రీ

కనకదుర్గాంబాయై నమః



# అర్జున ప్రతిజ్ఞ



## షష్ఠాంకము

ప్రదేశము—లంకాపట్టణము.

(విభీషణుఁడు, దీర్ఘబాహుఁడు, ప్రవేశము)

విభీ—మంత్రిచంద్రమా! మనచే పరిపాలితంబగు నీలంకారాజ్యమునఁగల దైత్యులెల్లరు దైవభక్తియు, గురుసేవారక్తియు, రాజ్యాభివృద్ధికై యాసక్తియుఁగల్గి శుభప్రారంభులై యుందురా?

దీర్ఘ—మహాప్రభూ! సాక్షాన్నారాయణావతారుండగు శ్రీరామచంద్రుని భక్తావతంసులలో నగ్రగణ్యులరగు తమ పాలనము శ్రీ రామరాజ్యముంబోలి యపారసుఖదాయకమై యున్నది.

సీ॥ ప్రతివీధిలో రామ ♦ భజనాలయములుంట
శ్రీరామచంద్రు స్మ♦రించువారు
జీవహింసను మాని ♦ జిహ్వకు రుచిగ శా
కాహారములఁ దృప్తి ♦ నందువారు
పూసలలో దార♦మునుబోలి మిత్రులై
యన్యోన్య సాహాయ్య ♦ మందువారు
పరకాంతలంగన్న ♦ భక్తి వినమ్రులై
జనయిత్రిల విధాన ♦ కనెడువారు
గీ॥ ముక్కుమూసి జపమునకై ♦ బూనువారు
విష్ణుగాథలు నిత్యంబు ♦ వినెడివారు
కలుగ మనరాజ్యమెల్ల త్వ♦త్కారుణవలన
దనరుచున్నది విబుధసం ♦ స్తవముగాగ.

విభీ—అమాత్యవరా! మనరాజ్యస్థితి నాలించుటచే నా కెంతయో సంతసముకల్గినది. ఇంకను అసంఖ్యాకములగు రామమందిరములు నిర్మించుటకు వలయువిత్తంబు వెచ్చించుము.

దీర్ఘ—తమ యగ్రజుండగు దశకంఠుండు కోటిశివాలయంబుల నిర్మించె. ఇప్పుడు తమచే నిర్మింపఁబడిన రామమందిరము లంతకు ద్విగుణీకృతముగ నున్నవి. నాఁటికిని నేఁటికిని నొక్క భక్తుల విషయమునసే చాల మార్పుకలిగె.

సీ॥ మెయినిండఁగ విభూతి ♦ మెత్తుచుండెడివారు
తిరుచూర్ణరేఖలు ♦ దిద్దుచుండ్రి
రుద్రాక్ష పేరుల ♦ ముదమానందెడువారు
తులసిపూసలకు కో ♦ర్కెలువహింతుర్రి
కాషాయవస్త్రముల్ ♦ కట్టుచుండెడివారు
పట్టుపుట్టంబుల ♦ గట్టుచుండ్రి
మారేడుదళముల ♦ మమతనఁగనువారు
యల శమీపత్రికై ♦ యభిలషింతుర్రి
గీ॥ హరహరా! ఓ యుమాధవా ♦ యనుటమాని
హరిహరీ ఓ యుమాధవా ♦ యనివచింతుర్రి
ధరణిపై 'యథారాజా, త♦థాప్రజా'య
టంచు నార్యుల నీతివా♦క్యమ్ముసరణి.

విభీ—ఎవరేనిభక్తిశూన్యులైక్రూరకృత్యములొనరించు వారునుగలరా?

దీర్ఘ—ధాన్యంపురాశిలోగల రాయిరప్పలవలె నెచ్చటేని స్వల్పముగాఁ గలరు. కాని యది యొక గణనీయముకాదు.

విభీ—అట్టివారిని శీఘ్రమే మనరాజ్యమునుండి బహిష్కృతులఁగావించి దుష్టనిశ్శేష మొనర్పుము.

(సేవకుఁడు ప్రవేశించును.)

సేవ—విభీషణమహారాజా! దేవరవారి సౌధాగ్రమున లేఖచేబద్ధమగు నొకబాణము విచిత్రముగ నాటఁబడియున్నది. అయ్యది తమ

యాజ్ఞలేమి గ్రహింపఁజనదని తమ కీవృత్తాంతము విజ్ఞాపన మొనర్ప నరుదెంచితిని.

విభీ—సత్వరమ్మున దానినిఁ గొనిరమ్ము. (సేవకుఁడు నిష్క్రమించును.) మంత్రిపుంగవా! ఇది చాల విచిత్రముగనున్నదే?

దీర్ఘ—ఇందు విచిత్రమేమిగలదు? ఎవఁడో ధనుర్విద్యావిశారదుఁ డంబుధి పరివృతమగు నీలంకాపట్టణముఁ జొర నశక్యమవుటం జేసి దేవరవారి కేయ్యదియో విన్నప మొనరింగఁ జేయుటకై పంపియుండును. అద్దానిఁ దిలకించినచో కరతలామలకము కాఁగలదుకదా!

విభీ—అట్టి ధనుర్విద్యావిశారదుఁడే యగుచో మనల జయించుట కాహవకేళిడకు రమ్మని లిఖించనేమోకదా?

దీర్ఘ—మహాత్మా! మీ కాసందియము లేశమేనియు వలదు.

గీ॥ శరధిపరివృతమౌ లంకఁ ♦ జొర నొకింత
శక్యమును లేని యాతండు ♦ సమరమునకు
కడఁగునని యెంచు టొకభ్రాంతి ♦ కాదె; యట్టి
కెగురలేక స్వర్గమ్మున ♦ కెగురఁగలరె?

(సేవకుఁడు బాణమును, దానిని గట్టినలేఖయుఁ దెచ్చియిచ్చును.)

విభీ—(ఆత్రముగ తీసికొనిమంత్రిచేతికొసంగి) దీనిని పఠించి నాసంశయము నివారింపుము.

దీర్ఘ—(ఉత్తరమును చదువును)

"రాజాధిరాజ మార్తాండ తేజులును నిరంతర విష్ణుసేవాధురంధరులును లంకాపురాధీశ్వరులునగు శ్రీ శ్రీ శ్రీ విభీషణ చక్రవర్తిగారికి.

హాస్తినాపుర ప్రభువులగు పాండుమహారాజతనయుఁడగు యర్జునుఁడు పంపిన విజ్ఞాపనలేఖ:

శ్రీ మా జననియగు కుంతీదేవిగారు వారణావతనగరమున రాగల భృగువాసరమున నైరావతవ్రత మొనర్పనుత్సాహాలురై యున్నారు. అద్దా

నికై దైత్యకులమున కొజన్మప్రత్యర్థియగు జంభారినిజయించి ఐరావత దంతావళమును పంపున ట్లొడంబడఁజేసితిమి. రక్తోత్పలంబులు మీరాజ్యమున విస్తరించి లభించునని విని మిముఁబ్రార్థించుచుంటిమి. మా మనోరథము సఫలీకృతము గావింతురు గాక!

ఇట్లు,

అర్జునుఁడు."

విభీ—ఓహో! పాండుభూపాలుని పుత్రరత్నమగు యర్జునుఁడా! ఇతండు జగదేకశరవిద్యానిపుణుఁడనియు, సౌమిత్రి శ్రీరామచంద్రునిసేవ నేమరనిచందమునట్లే యితఁడును తనయగ్రజుఁడగు ధర్మజునిసేవించుననియు మున్నొకతూరి వినియుంటిని.

దీర్ఘ—అగ్రజుని సేవించుటలో యా సౌమిత్రినిమించినవాఁడనియే నుడువఁజెల్లును.

విభీ—అదెట్లు?

దీర్ఘ—

శా॥ ప్రాంచల్లీల విరోధివర్గమునుజెండాడఁగ సమర్థుండుగా
మించన్ రాముని లక్ష్మణుం డటులపెంపెమించన్ విశేషంబె? నూ
హించన్ నిత్యముధర్మపన్నముల నెంతే కాలయాపంబు గా
వించన్ జాలినధర్మజున్ వరుఁడు సేవించున్ విశేషంబుగన్.

విభీ—అట్టియోగ్యుఁడగుచో వానిమనోరథము సఫలీకృతమొనర్పవలయును. మనవంశజులనెల్ల ననంఖ్యాకములగు యుద్ధములలో రూపుమాపినపాకారినిజయించినసీతనికి మన మీస్వల్పసహాయ్యమొనరించినచో మనపితృలోకమెల్ల సంతుష్టినొందును.

దీర్ఘ—భవదాజ్ఞానుసారము మనదైత్యుల మాయాబలముచే నిద్రితముహూర్తమునకు పూర్వమే తత్ప్రసూనముల వారిమందిరమున రాసులకొలంది నుండునటు లొనర్చెద.

విభీ—తద్వ్రత మెల్లియేయగుటంజేసి క్షిప్రముగఁజని తత్కార్య

సంసిద్ధికిఁగడఁగుదము. నాకు శ్రీరామమూర్తి సేవకు వేళయైనది. కాన పూజామందిరమున కేగెదను.(ఇరువురునిష్క్రమింతురు.)



## ద్వితీయ రంగము.

(మాదిగయెల్లిగాడు డప్పుతో ప్రవేశించును)

ఎల్లి—ఓ! పబుల్లాల! యీయాల తెల్లారితే కుంతమ్మగారింట ఐరావత వతం చేత్తారంట. మీరంతా తప్పక రావలసింది హా!

(పుల్లిగాడు ప్రవేశించును.)

పుల్లి—ఏందిరాళ సాటిత్తావు?

ఎల్లి—ఏముందిరా బావనోలకి. ఏంపన్లుండాయి. ఎక్కడా పప్పన్నం దొరక్కుంటే వరికైనా జోదసేసి వతాలుసేయిం చి పప్పన్నాలు తింటారు.

పుల్లి—వారికేంరా మహానుబోవులు. ఇప్పు డేమైనా వతంచేత్తా రంటారా?

ఎల్లి—గాందారమ్మగారు యేదోవతంచేసి మొగుడుసచ్చిందిగందా యని కుంతమ్మగారిని పిలిసిందిగాదంటా. ఆ మొయిన కుంతమ్మ గారు రోసమొడి అజ్జున్యుదొరతో సెప్పి యిప్పు డావతం సేత్తూన్నదంట. అది సాటింపమన్నారు

పుల్లి—అయితే వాల్లంతాఅయ్యాక మనకేమైనా కల్లుపోయిత్తా రంటారా?

ఎల్లి—మన సంగతోలకి పట్టిందోస్. మన కడుపులుకాల్తున్నా చూసే వారెవరోస్. తిన్నదరక్క తన్నుకునే బావనోరికి మనిసొక్కం ట్కి చేయచేరు సెయ్యాలంట. తిన్నన్ని బచ్చాలంట. ఇదిగాక పైన పత్తాలిచ్చి డబ్బుదోసి పెడతారంట.

పుల్లి—అట్లనబోకురా. మనగ్గూడా దర్మయ్యదొర కల్లుపోయింపఁడా?

ఎల్లి—అవునురా. గేపకంసేసావు, ఆదొర మంచోడు, మీసుట్టాలను పిల్సుకురారో ముంతలుతెచ్చుకో! ఇఁకపో!

పుల్లి—నేను మన పల్లెలో చెప్పి అందరిని పిల్చుకొస్తాను. (నిష్క్ర)
ఎల్లి—ఓ! పబుల్లాల......రావల్సిందిహో.

(అని పాటించుచు నిష్క్రమించును.)

---

## తృతీయ రంగము.

(కుంతీదేవి తెల్లని యేనుఁగయొక్క స్వరూపమునునిర్మించి పూజించుచుండును.)

కుంతి—(పూజనుండి లేచి దోసిలిపట్టుకొని) ఆశ్రితజనకల్పవల్లీ! దేవతామతల్లీ! కనకమయస్వరూపిణీ! పాపసంహారిణీ! రుద్రాణీ! స్వప్నప్రాయమై బుద్బుదమగు జలబిందువద్భ్రశమైయొప్పు యీజీవము మృత్యువాత నేక్షణమునఁబడునో అజ్ఞానులు గనలేక అరిషడ్వర్గమునకులోనై యీదృశ్యమెల్లయు శాశ్వతమే యని అసంఖ్యాకములగు దురితములొనర్చి నీపదభక్తిలేనివారై జననమరణాదు లనేకములొందుదురు. ఇఁక జ్ఞానులన్ననో సంచిత ప్రారబ్ధకర్మలచే యీదేహికిఁ గల్గిన సుఖదుఃఖముల కోర్చుకొని యహంకారరహితులై మమకారములవీడి మౌనముద్రవహించి నిర్మలమై నిత్యమై విరాజిలు భవత్పాదారవిందసేవఁ గావించుచు బ్రహ్మానందపరవశులై యంత్యమున శాశ్వతమైన మోక్షసామ్రాజ్య మధిష్ఠించెదరు. త్రిశంకుని స్వర్గమువలె నెందునుజేరక సంసారాంధకూపమున దరిఁగానక యల్లాడుచున్న నాకు తల్లీ! నీవే శరణ్యము. నీమహిమలనంతములు, వర్ణనాతీతములుకదా! నీకరుణావిశేషమను సౌధాగ్రమును జేరుట కీవ్రతములు నోములు సోపానపంక్తికదా!

మ॥ వృజినం బెంతయొనర్చి యుంటినొ యిసీ విశ్వస్తనై యీగతిన్
వ్యజనుల్ సల్పెడు హైన్యమే యనుభవింపంగావచ్చె నింకేమనన్
రుజలేనట్టి సుఖమ్మునిమ్ము? తవకారుణ్యమ్ము మూలమ్మునా
గజలక్ష్మీవ్రతసిద్ధికిన్ గనక దుర్గా! భక్తముక్తిప్రదా!

( తెరవైపు చెవియొగ్గి) ఎవరో గానమొనర్చుచు [illegible] వచ్చు చున్నటులున్నారు. ఈ విలాసవిద్యలతో నాకేల? నే నేగెద.

(కుంతి నిష్క్రమించును.)

(రంభ పాడుచువచ్చి యించుకకాలము నాట్యమొనర్చి చనును.)

---

## చతుర్థరంగము.

(ధృతరాష్ట్రుడు భీష్ముడు ఇంద్రుడు కృష్ణుడు ధర్మజభీమార్జునులు ప్రవేశింతురు.)

భీష్మ—వీరివ్రత మింత వైభవమున సమాప్తిగాంచుటకు శ్రీమన్నారాయణస్వరూపుఁడగు శ్రీకృష్ణుని కటాక్షవీక్షణమే యని వేయినోళ్ల నొక్కివక్కాణింపవచ్చును.

ధృత—ముమ్మాటికి ఘంటాపథముగ నుడువవచ్చును.

కృష్ణ—కం॥ మీరెల్ల రంగరక్షగ
పేరిమి ప్రేమించుచుండ ♦ వృత్రారియు మేల్
కారుణ్యము వహియించుచు
నైరావతిమీఁద సమాప్తి ♦ యయ్యెవ్రతంబుల్.

ధర్మ—ఏతద్వ్రతనిర్వహణమునకీ హేతువులేగాక వారి నిరుపమాన ప్రజ్ఞావిశేషమే ప్రధానమని నిస్సంశయముగ పలుకవచ్చును.

—ఆర్యులకృపావిశేషమే మాకుతొలినుండియు మాయభ్యుదయ పరంపరావాప్తికి తగినసాధనమగుచున్నది.

—మహాత్ములారా!

వయసునఁ జిన్నవార మటు ♦ పై సదసద్విషయమ్ము లెఱుంగ మీం
యు, జనకుండు మిమ్ములనె ♦ తారకమంచును జూపిపోయె ని
భయముగ, నీటముంచినను ♦ పాలనుముంచిన మీరెదిక్కు మీ
య పవిత్రసాంగమయ్యెఁ గల ♦ తప్పులు సైచుఁడి! కూర్మిఁ బెంపునన్.

—ము న్నెన్నఁడును కనివిని యెఱుఁగనిరీతి భూమ్యాకాశములకు శస్త్రసోపానములు నిర్మించిన యర్జునుని ప్రజ్ఞావిశేషములు, శక్తిసామర్థ్యములు నాకెంతయు న[illegible]వును ఆనందమును గల్గించెను.

# అర్జున ప్రతిజ్ఞ

ధృత—సత్యముగ వీరిజననముచే మా పితృపితామహవర్గంబెల్లఁ దరించుటయేకాక మావంశము నిష్కళంక తేజోవిరాజమానమై పూతమై గణనీయమైనది.

కృష్ణు—

ఉ॥ ఇట్టితలంపె నిత్యము వ ♦ హించి సుయోధనువాక్యముల్ చెవిం
బెట్టక వారిపైఁ గృపవు ♦ పృథ్వినివారికిఁ బ్రేమనిచ్చి యే
రిట్టును రవ్వలేక యవు ♦ గాయని నల్వురుమెచ్చ పూర్వస
మ్రాట్టులపోల్కి కీర్తిని వి ♦ రాజిలు మో ధృతరాష్ట్రభూపతీ!

ధృత—శ్రీకృష్ణా! యీవిషయమై యింత నొక్కివక్కాణింపనేల? నే నిదే మీయందరిసముఖమున వారిరాజ్యమును వారికొసఁగుచున్నాను.

భీష్మ—తథాస్తు.

ఇంద్రు—అర్జునా! నీవేవేని వరములుకోరుచో కోరుకొనుము.

అర్జు—దేవా! మీయనుగ్రహమువినా నాకేమియువలదు. ఐన నిట్లగుఁగాక!

చం॥ తనయులుభక్తియుక్తిఁ దలి ♦ దండ్రులసేవనొనర్చి యోగ్యవ
ర్తనులయి వారిమాట జవ ♦ దాటకయుండెదుగాక! సత్కవుల్
ఘనులచరిత్రముల్ దెలుపు ♦ గ్రంథములన్ రచియింతురుగాక!
మనము లనారతంబు బుధ ♦ మాన్యుల సేవల నిల్చుగావుతన్.

ఇంద్రు—తథాస్తు.

మంగళము.

సంపూర్ణము.



